ఓమ్.

# కంసవిజయము.

(అచ్చతెనుఁగు కావ్యము)



గ్రంథకర్త,

పాటిబండ పురుషోత్తమ కవి.

ఓమ్.

# కంసవిజయము.

పాటిబండ పురుషోత్తమకవి

విరచితము.

ఉభయభాషాప్రవీణ

మిన్నికంటి గురునాథశర్మ

పరిష్కృతము.

పతత్కవిదాహిత్రులు

నంబూరి వేంకటశేషయ్యగారిచేఁ

ప్రకటితము.

౧౯-౨౯ రు ౧.

ఓమ్.

# తెలివిడి.

చదువరులారా!

"విశ్వశ్రేయః కావ్యమ్" అను పలుకును దిలకించి కయిచందురులు గబ్బంబులొనరించి మనయెడందలకుఁ బబ్బంబులు గలిగించుచుండిరి. పలురకముల సంతసం బుల్లంబుల వెల్లివిరియుంగాని యయ్యది దీనికి సాటిగాదని యిదివఱకే పెద్దలుద్దవిడి నుడివియుండిరి. అట్టి తులలేని యెలమికి నెలవైన గబ్బి కబ్బంబులు దొలుదొలుత జేజేల బాసలోనుండి యల్లనల్లనఁ దెలుఁగునకు దిగినవి కనుకనే నన్నయ కయితమున నప్పలుకులు గుప్పలుగానొప్పినవి. రానురాను సన్నగిల్లినవి. కనుకఁ దిక్కనకయితలో మిక్కిలి తెలుఁగుపలుకులు కులికినవి. అసలు తెలుఁగుఁ బలుకులతోఁ బద్దెము వ్రాయుట పెద్ద ప్రేఁగు. ఈకొట్టరువు తిక్కన సోమయాజి వ్రాసిన యాంధ్ర భారతోత్తర రామాయణములలోనే అచ్చాంధ్ర నిర్వచన గ్రంథములు పుట్టుటకు విత్తనములుగలవు.

ఆతిక్కనకయితలోని తెనుఁగు నుడికారపు సొంపున కబ్బురంపడియచ్చతెనుఁగున యయాతి చరిత్రమును బొన్నిగంటి తెలఁగన్న వ్రాసెను. దానింగనుటచేతనే అడిదము బాలభాస్కర కృత శుద్ధాంధ్రరామాయణము కూచిమంచి తిమ్మకవి కృతములగు నచ్చ తెలుఁగు నీలా సుందరీ

పరిణామము నచ్చ తెలుఁగు రామాయణము మొదలగు తెలుఁగు పొత్తములు బయలుదేరినవి. పిదప.

కం. వచనము లేకయ వర్ణన రచియింపఁగఁ గొంతవచ్చుఁ
బ్రౌఢులకు అని తిక్కనసోమయాజియు,

ఉ. అచ్చతెలుంగుపద్దె మొకఁడైనను గబ్బములోన నుండినఁజా
హెచ్చనియాడుచుందురు

అని పొన్నిగంటి తెలఁగన్నయు వాయెత్తిపాడుచుచ్చుటం దర్వాతివారు దెలిసికొని తాము వారికంటె మిన్నలగుటకుఁ గాఁబోలు మిగుల జతనంబున రెండు నేమముల్మలం బాటించి " శుద్ధాంధ్ర, నిర్వచన, కావ్యముల వ్రాసిరి.

దండి తన దశకుమారచరితమున "లలితవల్లభారంభన దత్త దంత క్షత వ్యసన విహ్వలాధరమణి" యగు మంత్రి గుప్తునిచే నొక యుచ్ఛ్వాసము నిరోష్ఠ్యముగాఁ బలికించు చెతురుం జూచి వింతనుడికారముల కుబ్బిపోవు రామరాజ భూషణుఁడు, ఓష్ఠ్యము - ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము - అచల జిహ్వము మొదలగు రకముల పద్దెములను నుడువఁగా నెమ్మదిగాఁ దిమ్మన్న యరసి తన యచ్చతెల్గు రామాయణమున నయోధ్యకాండలో

సీ. చలి యిక్కదిండి యందెలతేని జిగిసేగ
సింగాణిఁ జెరిచిన చేఁతకాఁడ

జడదారి నెలదంటఁజ నిక్రచ్చుఅగయాళి
రాకాసిఁ జెండిన రాచకంద

అని దశరథుఁ బెదవి తగులకుండ నేర్పించినాఁడు.

మఱి, మఱింగంటి సింగరాచార్యుఁడో మిశ్రాంధ్రమున నిరోష్ఠ్యరామాయణము వ్రాసి యంతం దనివి సనక సీతాకల్యాణము నచ్చాంధ్రనిరోష్ఠ్యముగా వ్రాసెను. తర్వాతి వారచ్చెరువొంది తమ సత్తి నెఱుకసేయఁగానలయు శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకావ్యముల వ్రాసిరి. అట్టిది పుష్పబాణ విలాస మొకండు కలదు. ఒకటి యననేల? నూఱేండ్లనుండి యెన్నియేని వెల్వడినవి. దేవులపల్లి నృసింహశాస్త్రిగారు "అచ్చాంధ్రనిరోష్ఠ్య నిర్వచన సారంగధరచరిత్రము" వ్రాసిరఁట. తుదకు రాయబహదూరు కందుకూరి వీరేశలింగము గారు సైత మెసరేగి శుద్ధాంధ్రభారతసంగ్రహము. శుద్ధాంధ్ర రసికజనమనోరంజనము వ్రాసి యంత నిలువక శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధమును వ్రాసి విడిచిరి. అసమ్మనం గోరిక యేరికుండదు?

రామరాజభూషణుఁ డొకచో 'వర్గపంచకరహితసుగంధి వృత్తము' నొక్కదానిని వ్రాయఁగాఁ గాణాదము పెద్దన సోమయాజి 'శేషశైలేశలీల' యను పొత్తమునెల్ల నానేమంబునం దొమ్మిది యక్కరములతోడనే వ్రాసెను. అందును ముక్తపదగ్రస్తములుం గూడ గలవు. అది యట్లుండె.

అయ్యలారా!

తమ తలంపుల పెంపుల వెలువరించుటలయందీ నేమమ్ములెట్టి చదురులకేనిఁ గొంత యడ్డువడి కయితంపు వెల్లువ సొంపునడగించునని చెప్పకతప్పదు. చవియెఱిఁగిన చదువరుల కీత్రోవ లింపు నింపవని కొందఱందురు. నిజమే. కాని యొక్క యచ్చతెలుంగు నేమమ్మునే పాటించి వ్రాసిన యిట్లను కొనుటకే నిచ్చగింపను. ఈయచ్చతెనుఁగు నేమంపు ముల్లు కయితంపు వెల్లువ కడ్డుపుల్లలొకవేళ నొకచోటఁ గొండిక కైత గాండ్రకైన నగుఁగాక చదురులకన్న నోయిసుమంతయుఁ గావు. రెండుబాసల తేనియలంగలిపి త్రావునలవాటు మొయిఁ జదువరులకు మొదట నెట్టులేనియుండుంగాని దీనికిసైత మెంత చవిలేదు? ఎంతసొంపులేదు? ఎంత కులుకులేదు? ఒకవేళ లేకున్న నాతప్పెకయి చందురులదేకాని బాసదికాదని యంజలి సేసి విన్నవించుకొనియెదను.

అట్టి యందము చందము గల జిలిబిలి తెలుఁగుల కబ్బమే యీకంసవిజయము. చవిచేటనియెడు నిరోష్ఠ్య నిర్గద్యాదినియమములు లేవు.

దీనిని వ్రాసిన పురుషోత్తమ కవి సయితము.

« ఏనేలంగలవారి కాపుడము పల్కె మంచిదెన్నుండినన్ ॥

కంస 1—29

అనెను. ఏనేలవారికాచోటి బాసయేకాదు మంచిది „ దేశభాషలందు తెలుఁగు లెస్స ,, యని పెరవారిచే సముతము పేరుఁ గన్నది.

మానుసులకేమి? వేల్పు మెచ్చవలెఁగదా ? యని యందురవికాఁబోలు.

„ బుత్తిఁ ముత్తిలోసంగు వేల్పుఁ బలుకుల్ వోఁజేసి
కంస. — 28

అని జవాబుసెప్పుకొనెను.

౬

గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో „పాడిబండ్ల,, యను నూరుకలదు అందు „ భారద్వాజగోత్రము,, వారార్వేల నియోగి బ్రాహ్మణులుండిరి. వారు నిచ్చలు లాఁతులకు లగ్గుసేయుచ్చుగలవారు. ఆవంగడమ్ము నందొకకొమ్మను వెలిగించుచు వీరన్నపట్టి „ యుత్తరుండు ,, కరణికము సేయుచుఁబజ నలజడినొందింపక మేల్పుగూర్చుచుండును. ఆయుత్తరునకు మన పురుషోత్తముండును గురుమూర్తియు నను కొమరులిరువురు పుట్టిరి.

అందు గురుమూర్తి

సీ. చదివె వేలుపు బాససరిముట్టఁ దెల్విఁ జేఁ దెలుఁగుల గుట్టెల్లఁ దేటపఱిచె. కంస. 1—25

అను పద్యమువలన గొప్ప కైతగాఁడని తేలుచున్నది. అతఁడు గద్వాల సంస్థానమును మెట్టి యాతేని మెప్పించి "వర్షాశనము,, గైకొనెనఁట. ఇతని యన్నయగు పురుషోత్తముఁడే మనయీ కబ్బంబు వ్రాసిన దొడ్డకయిచందురుఁడు. చదువరులు చదురులు మేల్గొనముల కుదురులు కయిచందురులు నగు నీయిరువురు కొమరులఁ గన్న పాటిబండ ఉత్తరార్యుని పున్నెముల బాగు నెవరు కొండాడఁగలరు ?

పురుషోత్తమకవి కీర్తిశేషుఁడైనది ది 23-7-1882 తేదియఁట. అప్పటికీమేటికి డెబ్బది మూఁడేండ్లున్నవంట. కనుక నితఁడు 1809 వ యేటనే నిలలోనో పుట్టియుండును. నేటి "సోదరకవుల,, వలె నానాటి యీసోదరకవులును గడుంగడు వాసికెక్కి యెదిరికి గుండె గాలమువలె మనిరఁట ఇరువురు నిరుబాసల గడిదేఱిన దిట్టలఁట. కావున్న నచ్చ తెలుఁగు పొత్తము వ్రాయుటరిదికదా?

సిగ్గుమెయి నుగ్గడింప లేదేమోకాని మన పురుషోత్తమ కవియుఁ దఁన తమ్మునితోఁగూడ గద్వాల వెళ్ళి యుండును ఈపాటి లేనిమేటి 1 చిత్రకేతూపాఖ్యానము 2 శివరాత్రి మాహాత్మ్యము మున్నగు పొత్తముల వ్రాసెనఁట. వంశాభిమానులా పొత్తములంగూడ నచ్చొత్తించి చరితార్థులయ్యెదరుగాక. తమకుఁ బిల్లలు పుట్టి పోవుచుండుటచేఁ దల్లిదండ్రులీపట్టిని ,,"పిచ్చయ్య,, యనియుఁ బెరబందుగులు "పురుషోత్తముఁడు ,, అనియుఁ బిలుచుచుండిరఁట "పాటిబండ్ల పిచ్చయ్యగారు,, విద్దెలయొజ్జ యనుపేరు తెలుఁగు నాట

### ౨

నలముకొనుటతోడనే మండెపూడి, తాళ్ళూరు, పాములపాడు మున్నగు నూళ్లనుండి యెందఱో నరుదెంచి విద్దెల నభ్యసించి కయితగాండ్రయిరట. ఇతని సిసువు (బిడ్డఁడు) నగు రాయసము హనుమంతరాయ కవి (పాములపాడు) సిసువుల పోటీ పందెమున వ్రాసిన 'ధూళికోపాఖ్యాన కల్పితకావ్యము, నేటికిఁగలదఁట ,, పాటిబండ్ల పిచ్చయ్యగారు ,, అని పేరెఱుంగని వృద్ధసత్తెనపల్లి తాలూకాలో నేటికిని లేఁడనుట పొగడ్తపాలముందాటుటకాదు. వీరివంగడమువారు గొప్పపదవులలోఁ గలరుఁ వీరిమనుమఁడే సుప్రసిద్ధ న్యాయవాదియు గర్తపురీ నివాసుండును సుకవియు హనుమచ్ఛతకాది గ్రంథ కర్తయు నగు శ్రీసూర్యనారాయణరావు పంతులుగారు

### ౩

సహజపాండిత్యుఁడగు బమ్మెర పోతనామాత్యుఁడు శ్రీమదాంధ్రమహాభాగవతము రచించి లోకము నుద్ధరించెను. ఆయాంధ్రభాగవతమునందలి దశమస్కంధములోని పూర్వభాగముం గొంత గ్రహించి మన కవి కంసవిజయము వ్రాసెను. కథ యందఱెఱింగినదియ.

ఇందు దేవకి పెండ్లి మొదలుకొని కంస మరణము వఱకుఁగల కథ వర్ణితము మొదటిపాళమునఁ. బూతన మృతి వఱకు, రెండవ పాళమున బ్రహ్మ గర్వభంగమువఱకు మూఁడవ పాళమునఁ గంసుని మృతి వఱకుఁ గథ కలదు.

గోపికావస్త్రాపహారణకథ యేలనో తల్లికి నోట విశ్వముం జూపిన లీలానంతరమే యిందు వర్ణింపఁబడినది. భాగవత మున వత్సబకాఘాసురవధలు, బ్రహ్మ కాళీయ గర్వభంగ ములు వర్ణింపఁబడిన యనంతరము గలదు. కృష్ణుఁడు బాల్యము దాటిన వెనుక నీకార్యమొనర్చిన నసాధిత్యమని శంకించి కవి గోపికావస్త్రాపహారణకథను ముందునకు మార్చి యుండవచ్చును. అయినను భాగవతమునఁగూడ 'గోపికావస్త్రాప హారణము గోపీజనలాలనాదులు పౌగండవయస్కుఁడయియే యొనర్చినట్లు కలదు. కనుక నీమార్పునకుఁ బ్రబలకారణము కన్పింపదు.

మఱియు నిందు సుదర్శనుండను గంధర్వుని శాప విమోచనము చేయుట, నందుని వరుణనగరమునుండి తెచ్చుట యను విషయము లుల్లంఘింపఁబడినవి. ఇవియు శ్రీకృష్ణపర మాత్మమాహాత్మ్యముల బోధించు నవియే కదా?

ఋతువుల భాగవతమునందువలె నొకచోటనే వర్ణిం పక వర్షశరదృతువులు మాత్రము రెండుమూఁడు తావుల వర్ణింపఁబడినవి. ఇది యుచితము. "కార్చిచ్చు" నకుముందు గ్రీష్మమును వర్ణించిన బాగుగానుండెడిది.

వర్ణనములు

కం॥ పురసింధునగర్తువన శశి
సరసీవన మధురతి ప్రసంగవిరహముల్
పరిణయ తనయోదయునయ
వికచనయాత్రాజిదౌత్య విభువర్ణనముల్॥

కావ్యమున నుండవలయునని యొకమతము.

ఇందు పురవర్ణనము 1-42 ప. మొదలు సాంగము గాఁగలదు.

వర్షఋతువు. 2-134 శరత్తు. 3-92 నదీవర్ణన 3-8 విరహము రెండుమూఁడుపాళములను, జలక్రీడ 3-119 సూర్యోదయాదులు 3-147-150 ఇట్లు మఱియు మనోహరవర్ణనములు గలవు.

కవివిరంతరముఁ జూచుచుండుటం గాఁబోలు నెట్లు కాపెలను వర్ణించెనో చూడుఁడు.

సీ॥ వక్కలాకులు సున్న మక్కళించినజాతె
యడపంబుఁ గుచ్చెళ్ల యందుదోపి. కం. 3-94

పూతనాప్మృతి 1-165 వటవృక్షము 2-159 మొదలైనవి.

అలంకారములు.

వృత్త్యను ప్రాసమును వచనముల నెల్లెడవాడెను.

అంత్యప్రాస 2-137; 1-141;

శ్లేష 3-28

అతిశయోక్తులు 2-141 స్వభావోక్తులు. 3-94;

అర్థాంతరములు 2-132; 95.

ఇట్లలంకారము లందందుఁ గలవు.

రసములు,

విప్రలంభశృంగారమునకు 3_106 నుండియు
కరుణము 3_21; 1_59

హాస్యభీభత్సములకు 1_168 ఇట్లందం దాయారసము లించుకకలవు. ప్రతినాయకుఁడగు కంసపాత్రమును సంస్కరించి చిత్రించిన బాగుండెడిది.

అనుకరణము.

చ॥ తగులము లెచ్చటంగలవు
తాతబళాతన కూఁతుఁగోరఁడే? 3_102

ఇట్టిపద్యములు పెద్దన్ననుండి పుట్టినేటివఱకుఁ జిత్ర విచిత్రములుగాఁ గావ్యములందుఁ బ్రవహించుచున్నవి.

ఈకవికి భాగవతమునం దెంత గాఢభక్తికలదో తదనుకరణముల చాటఁజాలెడి.

సీ_తోయంబులివియని తొలఁగకచొచ్చెదు
తలఁచెదు గట్టైనఁ దరలనెత్త
మంటితో నాటలు మానవుకోరాడె
దున్నత స్తంభంబులూపఁబోయె
దన్యుల నల్వంబు లడుగంగఁ బాఱెదు
రాచవేఁటలఁ జాల ఱవ్వఁదెచ్చె
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు
ముసలిపై హరివృత్తి మొనయఁజూచె

దంబరంబు మొలకు నడుగవు
తిరిగెదవిఁకఁ గల్కి చేతలేల పుత్ర

భాగవతము-దశమ-పూర్వభా-377

అని మస్తంబులెత్తి యశోద పల్కును.

ఇట్టి పట్టుననే "వలదన్న నీటిలో వదలక తిరిగెద వల సటఁబడి యెత్తె దలమిగుండు...కంస॥ 2పా-67ప- అని యను కరింపఁబూనినాఁడు.

చాణూరుఁడు,

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు
నిగిడి గోత్రముదండ నిలువరాదు
కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు
మనుజసింహుఁడ నని మలయరాదు
చేరినఁ బడవైతుఁ జెయిచాఁపఁగారాదు
బెరసి నాముందటఁ బెరుఁగరాదు
భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి
శోధింతుఁ గానలఁ జొరఁగరాదు

దశమస్కంథము-పూర్వ 1340 ప.

అని భాగవతమునఁ బల్కఁగా

శా. మున్నీటంబడిపోయినన్ గడుపులోమోకాళ్లుసాప్పించినన్

కంస. 3-197

అని తేలఁ బల్కును బురుషోత్తముని చాణూరుఁడు.

కృష్ణుఁడు తమ వస్త్రముల నపహరింపఁగా గోపికలు

సీ. బహుజీవనముతోడ భాసిల్లియుండుటో
గోత్రంబు నిల్పుటో కూర్మితోడ
మహి నుద్ధరించుటో మనుజ సింహంబవై
ప్రజలఁ గాచుటొ కాక బలిఁ దెరల్చి
పిన్నవైయుండియుఁ బెంపువహించుటో
రాజుల గెల్చుటో రణములందు
గురునాజ్ఞసేయుటో గుణనిధివై
బల ప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల

దశమస్కంధ. పూర్వ 821 ప.

అని మొదలువెట్టి నట్టియెడఁ బురుషోత్తముని గోపికలో

సీ. పుడమి విత్తనములు పోకుండ నిల్పుటో......

కంస. 2-82

అని యందురు.

ఇట్లు మహాకూపారంబైన భాగవతమునందు వలెం జిన్నదియగు నీకంసవిజయమునను నొండుత్రోవ లేదన్నట్లు విసువులేక యీదశావతారముల వేషములు మార్చి పురుషోత్తమకవి 3-23 పద్యమునను, దండకమునను 2-206 చూర్ణిక యందును 3-157 మఱియు 3-63 మొదలుకొని 66 వఱకు వర్ణించును నాగాంగనలు కృష్ణునితో,

గీ. మమ్ము పెండ్లిసేయు మాప్రాణ వల్లభు
ప్రాణమిచ్చికావు భక్తవరద!

నీవుసేయుపెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటిపెండ్లి పెండ్లికాదు.

దశమ-పూర్వ 688

అను ముద్దులొలుకు కమ్మనిపద్దెము ననుకరింపఁబోయి హాస్యాస్పదుఁడై నాఁడు చూడుఁడు.
మొదటిపెండ్లి నేఁడుతుదముట్టె. కం॥ 3-21
దేవకి కంసుని కడ్డమువచ్చి

ఉ. అన్న శమింపుమన్న తగదల్లుఁడు గాఁడిది మేనగోడలా
మన్నన సేయుమన్న వినుమానినిఁ జంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనఁగదన్న మహాత్ములుపోవు త్రోవఁబో
వన్న భవత్సహోదరిఁ గదన్న నినుకా శరణంబు వేఁడెదన్.

అనుకరణ రసముట్టి పడుపద్యము దశమ-పూర్వ 150

మ. అకటా కూఁతురు కంస 1-130

అని పురుషోత్తముని దేవకి వారొత్తి విలపించినది.
ఇట్లే వసుదేవుఁడును,
మ. చెలియల్ గన్నియ ముద్దరాల బలసీ సేమంబ చింతించు

దశమ-పూర్వ 82

పురుషోత్తముఁడో

మ. చెలియల్ పిన్నది ముద్దరాలెపుడు నీసేమంబ కోరుకా

కం 1-59

అని మక్కికి మక్కిగాఁ గుక్కినాఁడు

శరద్రాత్రిం గానమొనర్చు కృష్ణుసన్నిధికి గోపికలు వచ్చుఘట్టమున భాగవతము నందలి వచనమునకు వచనముఁ బద్యములకుఁ బద్యములు గలవు.

సీ. ప్రాణేశుఁ డెఱింగినఁ బ్రాణంబునకుఁ దెగు
దండించు నెఱింగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ
దలవరి యెఱింగినఁ దగులు సేయు
తలిదండ్రు లెఱింగినఁ దలయెత్త కుందును
కేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱింగిన నాదరింపరు చూచి
బంధువు లెఱింగిన బహిరొనర్తు
రితరు లెఱిగి రేని నెంతయుఁ జుల్కఁగాఁ
జూతురింద నందు సుఖములేదు
యశము లేదు నిర్భయా నందమును లేదు
జారుఁ జేరఁ జనదు చారుముఖికి. దశ-పూ 979

పురుషోత్తముఁడు.

సీ. అమ్మ యెఱింగిన......... కంస· 3-99

ఇట్లు గర్భిణీవర్ణన, వృషభాసుర సర్పవర్ణనములు గోపీవిరహము మొదలైన వానికిం బుట్టినిల్లు భాగవతము.

భాగవతమున నక్రూరుఁడు కృష్ణునిదండకమునఁ బొగడఁ బురుషోత్తముని బ్రహ్మదండకమునఁ బొగడును.

నాగాంగన లిందఱివ్రజమునఁ బొగడ.

"నీయాన యెవ్వారిని నిగ్రహింపం డాయు గ్రిపాపాకృతి
నందఁ డింకం                    దశమ-పూర్వ 689

పాటికిఁగాఁబోలుఁ బురుషోత్తముం డనుకరింపఁబోయి యతిసర్వత్ర వర్జయేత్ అనినట్లు యతిసర్వత్ర వర్జించి యిం ద్రవజ్రముం జెప్పెను, చూడు. కంసవిజయము. 3-46

అనుకరణమను కరణము కాని సహజమెట్లగు? సహజా నందము కృత్రిమమున కెట్లు లభించును?

దీని ననుకరణ మనుటకంటె భాగవతమయచ్ఛాంధ్ర మునఁ బరివర్తిత మయ్యెననుట యొప్పు? దానియందీకవి కృతార్థుఁ డయ్యెను.

సాంస్కృతికములు.

అచ్చతెలుంగు పొత్తమున సాంస్కృతిక పదము లుండరాదు. తెలఁగన్న తిమ్మకవ్యాదులు నియమము సేసి కొనినట్లే మనకవియు.

గీ. కల్వఁ డొదవకుండఁ గావించుచో నూరి
పేరుమాసిఁ బొందుపేరుచోట
నవియ పలుకఁబడియె నందఱు దెలియుట
కలవికాదటంచు నట్టిమఱుఁగు.

అనియెంగానఁ దద్వ్యతిరిక్త స్థలంబుల సాంస్కృతి కము లుండరాదయినను బ్రమాదవశంబునఁ గాఁబోలు నం దందుఁ గన్పించుచున్నవి.

ప్రేల సంగతిఁ బూఁదోఁట వసించి— కం 3-164
కడుపు దోసపండుగతి— 3-130
ఏరీతిఁ— 3- 50
తెల్పుగతి— 3-148
అప్పుల తెప్పలం దేలి — 3-120, 1-49, 1-101
తెలివిని బొంది నిక్కముగ దేవుఁడు— 2- 61
తెలియుంగ నబ్రమే దేవు నడత— 3- 58
ఆయు విడు— 1- 5
సరసులు— 1- 44

ఆచరించు, చరించు మొదలైనవియుం గలవు.

ద్రుతప్రకృతులు గళలుగాఁ బడినవి.

కం॰ ఆతఁడు చెడురాకొమరుల...నుండ
గా తండ్రి— 1-52

కం. చేకామగ......కుచ్చు
లాకొండ......... 3-53

సుగలం పాఁపఁజేఁడు......
గాపసిండి— 1-131

మఱియు దుస్సంధులు.

చన నీడ్చెన్నవి— 2-27

ఇట్టివి భాగవతమునందుం గలవు.

"అనిలో నన్ను నెదిర్చి......భూమండలి
న్ననయంబుఁ......ఎట్లోర్తున్ను మానాయకా.

భాగవతము. ఉ. భా.

ఎత్తుక—2-11 పట్టుక 2_46 ఈడ్చుక 2-48 కాచుక 2-71 అందుక, 2-88 తోడుక, 2-127 తన్నుక, 2-15. 48.

"కొని" చేరుటకుం బదులు "క" మాత్రము చేరెను. ఇట్టివి విజయవిలాసమునం గుప్పలు కుప్పలు. మఱియుఁ గవి సార్వభౌమకృతిరత్నమగు అచ్చతెలుఁగు రామాయణమున అయోధ్యకాండలో

గీ. అడుగు వట్టుక మొఱసేయఁదొడఁగె నపుడు.

ఆరణ్యకాండమున,

సీ.........

పడగతాలుపు మోము ముడుచుక యుండెఁబో

కిష్కింధాకాండమున

సీ.........

ననుఁ దోడు పిల్చుక మొనసి యచ్చెనఁటిపై నరుగ

యుద్ధకాండమున

ఉ. కొంచక చేతులం గొఱవి కోలలు పట్టుక మేఁగి

ఇట్లెన్నేనిఁగలవు. కనుక నివి దోషములుగాఁ బరిగణింపఁబడకుండవలయును.

చేతును 2-24 మఱలఁజేతు 2_89

ఏమిసేతునో కందామని 3.50

నేఁగఁ దీతుఁదెమ్మని 2_178

ఇవి బాలవ్యాకరణ కారుని మతమున నపశబ్దములు. క్త్వార్థక సంధులుంగలవు.

మఱచిట్లు సేసితిఁ 3-66
మోసంబు 3-77
మేలొందట్లు 1-84 ఇట్టివికలవు.

"వెఱచిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు,, అని పూర్వకవి ప్రయోగము లుండుటంబట్టి సమాధాన పఱుచుకొన వలయును.

కలుగిమ్ముందెల్పి 1-84 ఇట్టి నుగాగమ విరహిత ప్రయోగంబులుం గలవు.

జవ్వనంపన్నువ 3-93 ఇట్టివి, టుగాగమ రహితంబులందం దుండెను గాబు (శబ్దము) 3-33; 1-88; 1-107; 2-134; 2-141; ఈపద్యములంగలవు. కొన్నిచోట్ల గాబుశబ్దమన్వయించుట లేదు, అర్థము చింత్యము.

1-98 శాశ్వతి, అనియు, దండకమునం „శార్ఙ్మంటే" అనియుం గలదు. అర్థము మృగ్యము.

ఇట్లే యాందందుఁ గొన్నిపద్యంబుల నన్వయంబులు గలవు. కొన్నింటిసవరించితింగాని కవియభిప్రాయములభింపమిఁ బ్రత్యంతరములు లేమిఁ గొన్నింటి నట్లే యుంచితిని. ఈగ్రంథమున సరళాదేశములు రేఫ శకటరేఫములు నర్ధానుస్వారములు మొదలైన వానిని శ్రద్ధగాసవరించి నను గనుదవలనివియు, సవరించినను మఱల నచ్చులో నెరసులేపడినవియుఁ బెక్కులుగలవు. మఱలశోధించి శుద్ధపత్రమున నర్థభంగస్థలములమాత్రము సవరించివ్రాసితి. మిగిలినవానిని బుద్ధిమంతు

లెఱుంగునది. నాకొక్క ప్రతిమాత్రమే లభించుటచేతను, నదియు నే గుణితము మాత్రమో వచ్చినవాఁడు వ్రాసినదగుటచేతను దోసంగులు పొసంగినవి. భగవదనుగ్రహమునఁ బునర్ముద్రణ భాగ్యములభించునేని నిర్దుష్టముగా నర్థసహితముగాఁ బ్రకటింపఁగలము. ఇంకొకమాటసెప్పి విరమించెదను.

మనకవిగారి యన్నగారైన గురుమూర్తిగారు ఋష్యశృంగోపాఖ్యానమను మహాప్రబంధము రచించిరి. అది పేరెన్నికం గన్నదియె. మనకవిగారిభార్య ఆదెమ్మగారు వీరికుమార్తెయగు వెంకాయమ్మగారి కుమారుఁడు నంబూరి వేంకటశేషయ్యగారే యీగ్రంథమును ప్రకటించి మహోపకారమొనర్చినది, తాతగారి మిగిలినపొత్తములఁగూడ నచిరకాలమునఁ బ్రకటించి యాంధ్రభాషాసేవ నొనర్చుటకు వేంకటశేషయ్యగారి నభినందించుచున్నారము. పరిమితపదములుగల యచ్చతెనుంగునఁ బొత్తమువ్రాసిన యనుపమానశేముషీవిభూషితులగు పురుషోత్తమకవి కంజలిసేసి సెలవుగైకొనియెదను.

ఇట్లు, భాషాసేవకుఁడు,

గుంటూరు
25-3-1929

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మ,
ఆంధ్రపండితుఁడు, టవున్ హైస్కూలు,
గుంటూరు.



ఓమ్.

శ్రీమేధా దక్షిణామూర్తి సద్గురు పరబ్రహ్మణేనమః

# కంసవిజయము.

## మొదటి పాళము.

చ. సిరిమను వెండిగట్టు తుదఁజేరి సగంబున మించునాఁతి మీ
సరవని నిక్కుచుండఁగని చాల్పగునీసున వేల్పుటేఱు పెం
దురుసున నెత్తి కెక్కనెటుఁ దోఁపక సిద్ధరమాని మజ్జి ముం
దరి జడదారియైన నెలఁదాలుపు వేడుదుఁ గోర్కెలొందఁగన్.

సీ. సింగంపు కొదమ మచ్చిక నెక్కువెలఁదుక
మగని సామేనిపొందుఁ గను చాన
దున్న రాఁకాసుల మిన్నగూల్చినయింతి
పాలేటికూఁతురి పాటిగరిత
పనిచెఱుపులవానిఁ గనిపెంచిన పెదమ్మ
వలిమలపట్టి నా వరలునెలఁత
కప్పుమేయొప్పుల గనియైనపడఁతుక
కొమరుసామిని ముద్దుఁ గొన్నముదిత

గీ. ముజ్జగంబుల నెఱఁబారి మునుఁగువారి
దోసములఁ బాపుచేడియఁ దోడిసవతి
మొదటిసత్తి మమ్మొకస్తి మొనయకుండ
గెల్పులనొసంగి చేవ నెక్కొలుపఁదలఁతు. ౭

చ. కలుముల చాన వెన్నవులఁగా వెలిమోరపులుంగుఁగూడి రా
వలపలఁ జుట్టువాల్మొదలు వాఁడికబొందళి ముల్పొసంగఁగాఁ
దలఁపున వేఁడు గబ్బిదెసఁదార్కొను ప్రేముడి వచ్చినట్టి పా
న్వాలువగలయ్యఁ గొల్తుఁ దనవానిగ నన్మనుపంగ నిచ్చలున్.

గీ. పాలకుప్పఁబుట్టి పసిమితామరగూట
మక్కువమరనిల్పి మగనిజొమ్ము
ద్రొక్కి వెలుఁగులచ్చి తూలించుఁగాత మా
కీము లెల్లఁగడల నేచిపోవ. ౮

ఉ. వెన్నునిబొడ్డుఁదామరగవిందొలుపుట్టువుఁగాంచిమాటయున్
కన్నియఁబుజ్జగించి యొసకంబుగ నాలుక నిల్పి వేల్పులం
దెన్నికపెద్దయై పుడమి నెల్లెడఁద్రిమ్మరు సామి బమ్మ నా
బన్నములూడ్చియాయువిడుఁబాయసికూరిమిమీఱనిచ్చలున్.

ఉ. కిన్నరకాయ గుబ్బచనుఁ గ్రేవలమిట్టుచు రాయిడింపఁగా
వన్నెపసిండి జిల్గు వలెవాఁటుమొలంటగఁ దోపి పాఁటలోఁ
దిన్నని పల్కులందొనరు తీపులనెల్లరు నీరుగా సుతుల్
చెన్నలరారఁ బాడు సిరిచేఁడియకోఁడలు నన్నుఁ బ్రోవుతన్.

ఉ. పుట్టిననాఁడె నింగిఁగడుఁ బొల్పరు వేవెలుఁగుల్గలయ్యనుం
బట్టి గుటుక్కునన్మెసవఁ బొల్పడినంతనె పుట్టెవాఁడు రా

నఁట్టె యెవిర్చిన న్వెనుక నడ్డమువచ్చిన వేల్పుటేన్గు ని
బ్బఁట్టొనరించి మ్రింగఁజనినట్టిమొకంబగు సామిఁగొల్చెదన్.

కం. ముక్కంటి మారురూపై
చొక్కఁపు వడుఁగైచరించి చొప్పనయనివా
గక్కరఁజక్కంబెట్టఁగ
నెక్కొను తపసికిని జోతనెరపుదు నెపుడున్॥ ౮

ఉ. కొక్కెఁట తేజి జందెములు కోరలతాఁచట బోసినోటిలో
నిక్కినదొక్కపల్లఁట పనింజెడఁజేయుట ముక్కమంట యా
తక్కరివేల్పు గుంపులకుఁ దా దళవాయఁట చోద్దెమైనము
న్మ్రొక్కుల దేవరన్గొలుతు మోసములీ కత కానకుండఁగన్.

గీ. తెలుఁగుఁబుట్టించి పుడమిపై నిలిపినట్టి
నన్నపార్యునిఁ బ్రిబలించినట్టి; తిక్క
జన్నిగట్టును మిగిలిన జాణపెద్ద
యల్లుడులనెల్లఁ దలఁపున నంటనెంతు. ౧౦

ఉ. తాడిననెండినాకు గుమిఁదాలిచి తిట్టినఁ జత్తురంచుఁ బె
క్కాడుచు మంచికబ్బముల నంటినయొప్పులఁ దప్పులంచునె
గ్గాడుచు మొద్దురాచదొర లబ్బనసుద్దులఁ బ్రొద్దుపుచ్చువా
రేడ నుడి న్నుడిన్మెఱుఁగు లేరెడినేర్పరు లేడ చూడఁగన్.

చం. అనితనుఁగొల్చు దేవరలనందఱ ముందఱ వేఁడి మీఁద తి
మ్మని కొలపెద్దగోచిగలమానిసికొక్కహుమాయికొత్తు మ
న్ననఁ గయివారముల్నెరపి నన్నయఁదిక్కన గారవించి త
క్కిన నెరవేడ్కఁగబ్బముముగించు తలంపుననుండునంతలోన్.

సీ. పోతనపేరిటి ప్రోడసెప్పిన నల
సామి ముచ్చట బడిఁజదువు బుడుత
లోడకచదువంగ నూకొని విని గిన్నె
పేరివాని నడంచి బిరుదుఁగనిన
కత ముగింపుదునని కడఁగితి దానికిఁ
దోడయ్యెఁ బల్కుపూఁబోఁడి దాని
గాకున్న నెరవేర్పఁ గలరె మాబోఁటులు
జగము కబ్బురములై జరుగు సామి

గీ. సేఁతలెక్కడ మానిసి చిదుఁగులోనఁ
గొంచెమగు నాదు తలఁపేడ నెంచిచూడ
నక్కమెక మెక్కఁగలదె వేల్పెక్కుడరికిఁ
జీమ దిగమ్రింగఁ గలదె కార్చిచ్చుబుడ్డి. ౧౩

వ. అని తలపోయుచు నైనంగాని మ్మాదేవరపై డెందంబుఁ బొందుపఱిచి చేయంబూనుదుఁ గాకేలఁ బోవుననియు, నీకబ్బం బాతోలుఁదాలుపు పాలుసేయుదుననియుం దలంచి మొదల నేఁ గలిగినకొలంబువరుస నెఱిఁగిన కొలంది వక్కాణించెద. ౧౪

సీ. ప్రాఁజదువులలోనఁ బబ్బంబులొనరింపఁ
దగినంతఁ దెచ్చె నే తపసిమిన్న
మింటవెలింగెడు మేలైనచుక్కల
నడుమఁ దోఁతెంచు నే జడలఁదాల్పు

పుట్టుపుట్టువునకుఁ బొలివోనిబత్తితో
నూడిగంబెవఁడు పెంపూని నడిపెఁ
గలవంటకంబులు గలుగ రాగవునకు
విందాపె నేమంటి వేల్పుమిన్న

గీ. యేజడలుఁదాల్పు పున్నెంపు టెచ్చువలన
నెలవుఁజేసిన యడవిలోఁ గలమొకములు
కంటగింపులు లేకుండఁ గలసితిరుగు
నతఁడుగాఁడె భరద్వాజుఁ డనెడిప్రోడ. ౧౬

ఉ. ఆయన వంగడంపుమొద లావెనుకం బడి యుప్పతిల్లు సం
తాయె జగంబులోనఁ దరుచందొక కొమ్మనుబుట్టె రాగవుం
డేయెడ కుందులేక యసమేర్పడఁ గన్పడె నాఁఉవేలవా
రాయననుండి చెప్పఁబడి రంతటినుండియుఁ గల్గిరందఱుర్.

గీ. పాఁటిబండయనెడి వీటఁగాఁపురమాట
నదియ యింటిపేర నందగించె
నందువెంకమంత్రి యన నుప్పతిల్లె ము
త్తాత నాకతండు దలఁచిచూడ. ౧౭

ఉ. పెద్దెలమేలుబంతి సరిపేఁడుల ప్రెగ్గడల న్వెలంతి తా
నెద్దితలంచె దాని నిలు పేర్పరుపంగల తంతిరన్ని మే
ల్మద్దియరాణి గామెలఁగు ముక్కను దేవర బత్తిఁగొల్చునా
గద్దిరికీడు లేరు వెదుకం బుడమింగల జన్నిగట్టులర్. ౧౮

కం. ఆనెరవరికిం గొడుకులు
పూనిక చెల్లించు బిరుదుబొందుదు లరయుం

గా నిరువురు వెంకనయును
మానుగ వీరన్నయనఁగ మంతురు లరయన్. ౧౯

వ. అందుఁ గడపటికొమరుండు. ౨౦

సీ. కట్టించెఁ బెనురాలఁ జుట్టు గోడలుమించ
దేవళం బేనుఁగు తిత్తిదొరకు
మట్టించె డాకాల మనికిపట్టులు వీడి
పరువెత్తి జుణఁగనొప్పని బిరుసుల
మెప్పించెఁ దగవుల మెలఁకువతోఁ బల్కు
నిక్కంపునుడుల మన్నెలచదురుల
నొప్పించెఁ బ్రామిన్కు తిప్పల తుదల గు
ట్టులు ముచ్చటించి జోఁగుల యెడదలఁ

గీ గూడుఁజీరలుఁ గోరినకొలఁది నిచ్చి
యడుగువారలు మెచ్చుట లాలకించి
పాఁడిపంటల మేటినాఁ బరగెఁ నేల
వీరనకుసాటి మంతురు లేరి తెలప? ౨౧

కం. ఆవీరన్నకుఁ బుట్టిరి
దేవేరగు నచ్చమకును తెలివిగనులు మే
లీవులు ముప్వురుగొడుకులు
నావలఁతుల పెద్ద యుత్తరప్పఁడు వెలసెన్! ౨౨

సీ. అయిదక్కరలఁగూర్చ ననయంబు దలపోయు
వేఁకువ చలినీటివాఁకమున్గఁ

ప్రామినుకులతల్లి బత్తిమీఱఁగఁగొల్చుఁ
బూటకు వేమారు నోటు లేక
నూరిలెక్కలనెల్లఁ దీరుమూన మొనర్చు
దబ్బరమాటల దాటిజరుగు
నడిగిన లేదనఁ డుడుగర లెన్నఁడుఁ
గలిగినంత యొసంగు గడుసుగాఁడు

గీ. పెద్దలను వెంబడించి యేపొద్దుజరుగు
దిద్దుబడిఁజేయుఁ దగవుల సుద్దులరసి
పద్దుసల్లించుకొను రచ్చ పట్టుఁజేరి
పొత్తు లేరన్న వీరన్న యుత్తరునకు. ౨౩

క. ఆయుత్తరునకు నేనును
బాయని తిర యసముఁగల్గు బలియుఁడు గురుమూ
ర్తియనఁగాఁ దగు నతడుం
దోయము బుట్టితిమి నల్వ తొయ్యలికూర్మిన్. ౨౪

సీ. చదివె వేలువుఁబాస సరిముట్టఁ దెల్వి చేఁ
దెలుఁగులగుట్టెల్లఁ దేటపఱిచె
మెప్పించెఁ గైతచే మెఱుగైనచదురుల
నొప్పించెఁ దప్పులఁజెప్పువారి
నెగడించెఁ గబ్బము ల్నెరతనంబుఁగ గూర్చి
రాచకర్జంబుల రవళినెఱిఁగె
గాణలపాటల కడకుఁబో నదలించెఁ
గలనేనిఁ గల్లాడుటలు మఁగించెఁ

గీ. బుడమి గద్వాలతేని మెప్పులఁబొసంగఁ
దనిపి వారిచ్చుకానుక ల్తరతరముగ
నందికొనివచ్చి వేడుక నలరుచుండె
మూర్తి గొనమెన్నఁ దెలియని మూఁకకగునె. ౨౫

చ. అతనికిఁబెద్దవాఁడఁ దొలియయ్యలమేటి పసిండికొండచే
జతపడియుండు ముక్కనులసామికి బత్తుఁడఁ బాటిబండలో
నతికినమన్కివాఁడ నరయం బురుషోత్తముపేరివాఁడ మే
ల్కత లతికించి కబ్బములుగా నొనరింపఁగలాఁడ గొబ్బునన్

వ. నాచేయు నీతెనుఁగు కబ్బంబునం దొనరిన నెరసు లెరుకగల వారుసవరించుటకొఱకును మెఱుగులొనరు చోటులరసిమెఱుకలేని మొఱకులు కూఁడనివని చెఱుపకుండుటకొఱకును మనవిపడియెద. జాబిల్లియందొనరు మసరనెంచుదురే తేట వెలుంగులు తనడయ్యుఁ దలంపక జేజేలకిచ్చుట మొదలగు మంచిసంచు నెంచుదురుగదా యట్లనాచేయుకబ్బంబునంగల యొరుగుతరుగులు కనికరంబున లోఁగొని పాటికిఁ దెమ్మని యందఱనెచ్చరించితి మఱియును. ౨౭

శా. బుత్తిన్మత్తి నొసంగువేల్పుఁబలుకుల్వోఁజేసియాంధ్రాడువా
గుత్తింజేర్చినఁ జేదుమేపుడిది బాగుంబోలె గ్రైసేయుఁడీ
గొత్తల్పల్కుఁడయ్యలార పునుకల్గోర్కెన్నెడందాల్పుటేఁ
డొత్తండొప్పని దంచుఁగొల్పిననతండొప్పించు నీకబ్బమున్

శా. ఏనేలంగల వారికాపుడమి పల్కెమంచి దెన్నుండిన
న్నానెందాస దగుల్చునో యదియెకాదా మంచి జేజేలకై

బోనంబప్పన సేయుటట్టులనె వాబూరింపుడౌ బానతోఁ
గానంజేసితిఁ బొత్తమెల్లఁ దెనుఁగై కన్పట్టి పెంపొందఁగన్.

గీ. కల్పుడొదవకుండఁ గావించుచో నూరి
పేరు మాసిబొందు పేరుచోట
నవియ పలుకఁబడియె నందఱుఁ దెలియుట
కలవి గాదటంచు నట్టిమఱుఁగు. ౩౦

వ. అని యిట్లుగడించి చిలువ సొమ్ములవాని కంకితంబొనర్పుట
నాయన నెన్నెద. ౩౧

సీ. పగలొనరించెడి పసిడికొండనునగి
విసపు దాల్పులరాతి యసమడంచి
మబ్బులీనెడు వెన్కమలనుండుటకు రోసి
యివమైన పెనుచట్టునెనయుటుడిగి
కడల నెక్కొనుచుట్టు గట్టుపైఁ దమిబాసి
వడిసిల్లుగలుగు గవ్వపుగడివిడి
యాబోతుతొక్కిడి నరిగినకలుగెంటి
రెండు తూటుల కొంగ కొండవదలి

గీ. చిలువరా చిక్కులొదవక చిక్కనైన
నల్లరామొత్తమమరి యుప్పొల్లసిల్లు
దొనలఁ జెలువొందు విడివొట్టు దోచుపాటు
బండ నెల కొన్న ముక్కంటి బలియుఁ దలఁతు. ౩౨

## షష్ఠ్యంతములు.

ఉ. ముమ్మొనవాలుచే నమర మోసమెఱుంగని వానికిం జలిం
గ్రమ్మగు కొండకూతురి సగంబున దాలిచియున్న వానికిం
బొమ్మగ బొమ్మ పుచ్చెగుడుసు ల్మెడవెంబడి వ్రేలువానికిం
దెమ్మెర మేపుడు ల్చెవులఁ ద్రిప్పెడు టొంటులఁబోలువానికిన్.

ఉ. వేనెలుగప్పుపుట్టువును వెల్లవెలుంగును మూఁడుకన్నులై
చేవదలిర్చు వానికిని జీదర గబ్బిమెకంపు వల్వుడిం
పౌ వలె వాటుదుప్పటిగ నాపినవానికి మావిపూలతో
రీవలకేలిబంటు నెదురించిన కన్నెగ గూల్చుమన్నెకున్. ౩౮

చ. కలువలవిందు జుట్టికొనఁగట్టిన వానికి వెండికొండపై
నిలుకడఁ గల్గువానికి మునింగెడి బత్తులవేల్పువాక ముం
దలగల వానికిం గుతుక దాపినచేదు పిసాళివానికిం
దొలిగలు బన్నికర్జముల తూగుడు బిడ్డనిఁ గన్నవానికిన్.

ఉ. మిత్తి కరుక్కనంజదిపి మేటి యనందగు వానికిన్ జడ
ల్నెత్తిని మిన్ను బ్రాకుడుల నెక్కొనమూపున నట్టువొందుమే
ల్నత్తికి మెప్పుగా మెలఁగు సామికి నన్ని యెఱుంగు వానికిం
గిత్తల మిన్న తేజిపయిఁగీల్కొని ముజ్జగ మేలుఁవానికిన్.

ఉ. మామయొనర్పు జన్నమున మన్ననగాంచిన వేల్పుమిన్నలం
దామస మెచ్చివేలిమిన దక్కనగూల్చిన వానికి న్నిడం
బైమను నాలబోఁతు వెలయందగు వానికి నల్వనెన్నొసల్
బా)మిన నీరుగుండమున నాడనొడల్గని నయ్యవారికిన్.

వ. అప్పనంబుగా నేఁజేయంబూనిన కంసవిజయంబను గొప్ప
కబ్బంబునం దొనరుకత తెలుగు పలుకుల నతికిన గద్దె
పద్దెంబుల జాడలెట్లంటేని. ౩౮

గీ. సిరివెలయు గబ్బిపేరిచేఁ జెలువుమిగులు
ప్రోలునేలుచు మనెడి రాచూలిపేర్మిఁ
జిలుకపేరింటి జోగికిఁ జేతులెత్తి
యడిగె వెన్నునిబుట్టువు నమరుకూర్మి. ౩౯

ఉ. తాపసి మన్నమున్న పినఁదాల్పితిఁ దామరవిందురిక్కఁ దే
డాపిన వంగడంబులు తుదైచనఁగా మదిబొంగె నెన్నినా
శ్రీపుడమిం జరించెఁ దగ వెన్నక మామనడంచె నేల న
ల్పాపురరాచవారి గుదులై పడనెట్టు లొనర్చె శౌరిదాఁ

ఉ. తల్లియుఁ దండ్రియు న్వగవ దాపున నుండక లేచిపోయి ప్రే
పల్లియ నెన్నినాళ్లు పలుబాములఁజెందె మొదల్తుదంటి రా
నెల్లను దెల్పవే యనుడు నిచ్చక మెచ్చగ నల్లదీవిపు
ట్టిల్లగు జన్నిగట్టునకు నేచినవేడుక మ్రొక్కియిట్లనున్.

మ. పగవారెప్పుడు గుండెచీకు పడఁగాఁ బల్గాకులల్లాడఁగా
మగరామేడల నీటితేటలొనరన్మారెండుఁ లేకొప్పఁగాఁ
బ్రెగడల్కొల్వలఁ గొల్వ రాచ పడుచుల్పొరొంది చెన్నొందగాఁ
దగుముత్తావుల ప్రోలు పెన్మదిరె నాతారాణ లేకెచ్చటన్.

కం. ఇదిసొబగు వీళ్లలోనని
వదరుదు రెల్లరునుదాని పసనెన్నంగాఁ
గొదువయగు పల్కుబోటికి
ముదిదిలువల తేనికెన్న మొఱకులకగునే. ౪౩

సీ. మేడలఁబటికంపు గోడల నంగడి
వాడలఁజూడ బల్వేడుకదగుఁ
గొట్టులు జగమేలు కట్టులు రతనంపు
బెట్టులెల్లెడలఁ జూపట్టుచుండుఁ
బావులు విత్తుల కావులుతీపినీ
ర్బావులెల్లెడఁగన బాగుమీరు
నిమ్మలిగిర్చిన కొమ్మలు మెట్టకెం
దమ్ములు లేఁదోటఁదనరుచుండుఁ

గీ. గాన నీయూరియందమ్ము గరువతనముఁ
జూడ నేవీట లేకుంటఁ జూచి సరసు
లావజల్లిన దిగువ రాత్రోవ లేని
యంత సందడిమెలఁగుదు రబ్ధిమొలయ. ౪౪

మ. పలుకుల్ముల్లులుమార్తురంగెడపఁగాఁబ్రామిన్కు బాసాడుచే
వలనంజూచిన నింటఁగల్గు నిజమే వాక్రుత్తురే మిచ్చినన్
బలుకన్దాగరు దబ్బరల్వీసువ రెవ్వారెన్ని విద్దెల్గొనన్
జెలువై యిమ్మసి జేరఁజెప్పుదురు మజ్జేజెల్గ రంబయ్యేడన్.

చ. దురమనఁబొంగుడెందములతూకొనిపోయెదరయ్యవారులం
బరువడిఁబ్రోతు రోగిరము బత్తినొసంగుదు రెద్దడొచెలిం
సిరివెలయింతు రక్కజపు చెయ్వులవేల్పులకెక్కుడౌదు రొ
క్కరమని నాలమంద దరికైచనరందలి ఆచబల్లిదుల్.

గీ. చలికిఁ గూడుచీర వెలితైన యెడనీని
రొక్కమున్నవాసి కెక్కుచెట్టు

లనుచు దెసలనిండ లందుజక్కులతేని
లెక్కఁగొనరు వెలల నిక్కలందు. ౪౭

గీ. తాటిసిడెముసామి తడబడ జముననా
గేటజిమ్మెనేటి పోటరియని
మదిరెనున్న రెడ్డి మడియలు మడకల
గొట్టునేలనెడల గొట్టుదు రొగి. ౪౮

సీ. ఆవీటితేరుల కగునె సాటొకగాల
నమరిన కాకరాయరదమెన్న
నాయూరితేజీల కగునె తరంబప్పు
పుట్టుకమెలఁగిన తట్టుమావు
లాప్రోలఁదగునేన్గు రాప్రోవులకుసరి
చెందునే దెసబడ్డ చెనటుగబ్బ
లాపల్లెకాల్బంటు లంత వాఁడేసత్తి
బట్టయిట్టటుజూచు బసుమదారి
పుడమి జత దీసికిల్లె రాప్రోడలెల్ల
కానుకలుదెచ్చి యిడిన చోక్కపుకడాని
చే నమర్చిన కోటయుఁ జెందిరంపు
మానికంబుల వెలయు కొమ్మలునుగలుగ. ౪౯

వ. అవ్వీటియందు. ౫౦

గీ. వాలెదురు కీడుచుక్క సంతేలికదగు
నుగ్రసేనుండనఁగ నాతఁ డోపిపుడమి
కడిఁది తనయానచెల్లించు పుడియతమ్ము
పాపఁడగు కంసునకుఁదండ్రి పాలుపుడమి. ౫౧

క. ఆతఁడు చెదురాకొమరుల
నేతెరి జతవదలకుండ నేలుచునుండం
గా తండ్రి దేవకుఁడు తన
కూఁతురు దేవకికిఁ బెండ్లి కొమరుని వెతకెన్. ౫౨

వ. అట్టియెడ. ౫౩

సీ. ఆయూర దననాడు లరయుచు వసుదేవుఁ
డనుదొర కాపుర మమరఁజేయు
నాతనికాకూఁతు నప్పనజేసి పెం
డిలిమైన నిద్దరిఁ గలిమికొలఁది
ననుపుచుఁ గన్నియకై కట్టఁ దొడగంగ
నిచ్చిననల్లున కిడినమావు
లేనుగు లొమ్మదవులు మానికంబుల తేరు
లంటి రాఁజెలియలి ననుపుకూర్మిఁ

గీ. గంసు డరదంబు నడపుచుఁ గదిసినడిచె
నాగవాసంబు మున్నాడి నట్టువపస
నెరపనరపుడు గుంపులు నెరతనముగ
చుట్టిరాపెండ్లి కొడుకగు సొబగుదనర. ౫౪

శా. ఆలోనంబయలాడెఁగంసవినుమీయన్నబ్బమేనిక్కుచున్
దోలంబూనితి మావులం గనుమిదే తోరంపు కీడేడుపై
చూలం జెల్లెలు గాంచుబిడ్డఁడు నినుంబోలించి చక్కాడు నిం
కీలాగాట నెఱుంగవక్కట నిజం బీసుద్ది తేటయ్యెడిన్.

వ. అను మేనుతేని దయ్యంపుమాట లాలకించి జాలింబడి
కంసుండు. ౫౬

శా. తోడంబుట్టువు మీఁదరోసి యలుకం దోడ్తోడ గోడాడి యే
జాడం డెందము నిల్వగాక బ్రతుకా సన్నాలు గేలానిసై
దోడా! మూడెఁదలంప దోసముల పేఁద్రుంగింతు నేడంచుఁగీ
లూడం గొప్పమరించి చేతనిడె వీఁడోహో కటా యెట్లనన్.

క. అదిగని వసుదేవుఁడు న
మ్మదిఁగొందల మంది మంచి మాటలఁదేర్తున్
దదు కెట్టులైనఁగానీ
వదరెద నాతలఁపుకొలఁది వదలని తెగువన్. ౫౮

మ. చెలియల్పిన్నది ముద్దరాలెపుడు నీసేమంబు గోరుం బళా
కలకంబారి తలంటి కోయుదువె రాకాసిం బలెఁన్నేర్పుతో
దలఁపోయ న్వలదే చదల్పలుకులే తార్కాణ సీవంగడం
బలతింగాఁ దిలకించితే విడువుమీ యన్నుం జిరాయున్వగన్

ఉ. మిత్తి నడాన లేదు తొలిమేనికి దాని మలంప నేరికిన్
వాత్తకు నిక్క మిప్పలుకు లన్నియు నీవు నెఱుంగు దక్కటా
క్రొత్తలె చంపఁ బూనెదవు కోరికబుట్టినఁ జచ్చి క్రమ్మర
న్వత్తురె తెల్వి నెక్కలిపి వారకజూడుము నీయెడందలో.

కం. బోటికిఁబుట్టెడు బిడ్డఁడు
చేటుగ వినఁ జెప్పెననుచుఁ జెందెదవళుకిం
కేటికి విన్న పలుకునను
మాటెన్నఁడు వినము పగర మాటలో యేమో. ౬౧

మ. నిజమై నీకిది కీడుదెచ్చుననుచు న్నీవేల బేలయ్యెద
క్కజపున్మాటలుమానుమీాయనినఁగిన్కంజంపుటల్క న్నికే
పజ పుట్టన్వెను వెంట నీకొసఁగెదం బంతంబు తోఁజంపి కీ
డుఁజెడ న్నీదటసంతసంబుగను మీాకుంజోడు లగ్గింపఁగన్.

గీ. అనుచు మాటలఁదేర్చిన నతఁడు తొట్రు
పాటుడిగి నమ్మి చేనున్న బాకునట్టె
వదలి వాల్చి మోమచ్చోటు వాసిచనియె
నతివయు నతండు నిలుత్రోవ నరిగిరంత. ౬౩

వ. ఇట్లటేగి గురుతెఱుఁగరాని తమకంబున వలరాచ గొరక లెఱకలు గాడ వేడుకపడుచుండ నాయేటి తుదకాఁబోటి కైన మొదటివేకటికి న్గొడుకు వొడమె నాబుడుత నవ్వాసు దేవుండు నడితిగడి మీారని రాచకొడుకుఁ గావునఁ దన పడఁతి కొడుకు విడలేక జడిబడినడల నాబిడమెడలాని యావలఁ బడనెట్టి యీాపట్టినీక రట్టుమోసి చెట్టంబడు దునేపెట్టుకొన్నట్టియొట్టుమట్టు మీారుదునేయని యాపెను దిట్టి యీాపున్కిఁ జెల్లించిన నెల్లకర్జంబు లుల్లసిల్లునని పిల్లఁ దల్లి నల్లికకుంబాపి యుల్లంబునఁ దల్లడిల్లుటలు లేక దొమ్మాని తెచ్చి యుమ్మలికంబున సొమ్మసిల్లు మఱిది కుఱంగటనిలిపి నీవలచినరీతి నొనరింపు మేనుమాటఁదప్పక యొప్పించితినని కసిగందు నందిచ్చిన నాగిన్నెపేరి మన్నె వాఁడన్న నీచిన్నిపాపని మన్నించితిఁ గొన్నిరోజు లరిగిన మీాఁద నగుసెనిమిదవ చూలుం బాలుమాలక జంప నిమ్మా ఒప్పుకొనియెద నిపుడు నీబుడుత కుఱలంగొని

పొమ్మనిన నాశౌరియు నమ్మక నేనేమిసేయువాఁడఁ
బోయెదంగాక యెట్లైనం గానిమ్మని కొడుకుం దెచ్చి జరి
గిన కత మొదలుం దుద సేర్పడం జెప్పి యప్పడతి కప్ప
గించి మఱియును. ౬౪

ఉ. పంటవెలందిరక్కసుల పాడరుదాటులకోర్వలేకము
క్కంటికిఁ దెల్పనాయన పగిందెగ నాడక పొమ్మటన్న నా
వెంట నెకోడుతో నలువ వీటికిఁ జేరి దిగుల్లలంపఁ గ
న్గంటలనీరుగార నటు సాఁగిలి మ్రొక్కుచుఁ దాలితో ననున్

ఉ. తామరచూలి! రక్కసులదాడుల నేఁడగు వేఁగుజోలి నీ
కేమని విన్నవింతు బరువేగడితోరివ గడింపుమన్న నా
లేమ మగండు మంచిదని లేచి నడం దివిమూక గూడి రా
నోమిక వెన్నఁడున్న కడ కుప్పరవీది హుటాహుటిన్ జనెన్

వ. నడచి వడితనంబున. ౬౭

గీ. పాలకడలిఁ జేరి బడి వెన్నునకుఁ దెల్పి
వెలయఁ జేసి తాను విని యెనొక్క
మాట దానిఁ దెల్పి మంటితత్తరమూడ్చె
వేలుపులకుఁ దలఁపు వేడిమాఱె. ౬౮

వ. అటనందఱుఁ గలయం గనుంగొని మఱియు నిట్లనియె ౬౯

కం. జేజేలారా! వినరీ
యోజం జని జంకదాలు పొప్పొ కొలమునం
దేజునఁ బుట్టుఁడు వెన్నుఁడు
ప్రాఁజదువుల ద్రోవనిల్పు పనికటుఁ బుట్టున్. ౭౦

కం. వేలుపుఁ జానలుగొల్వఁగ
మేలన సొబగొప్పఁబుట్టి మెలఁగుఁడు తొలిగాఁ
దాలిమి చెలఁగఁగఁ గఱ్ఱియు
జాలింబడ పగతుఁడిచటఁ జయ్యనఁబుట్టున్. ౭౧

మ. సిరితేఁడీగతిఁ బుట్టి యుత్తపసులం సేమంబుగల్గించి పె
ద్దఱికంబెంచక త్రుళ్లు నుక్కువుల ప్రమందంజేయు దేనంచుఁ జ
క్కెరలొల్కన్నెలవిచ్చెఁ దప్పదదిరా కీడొటనిక్కంబు మీ
దిరవుజ్జేరుఁడు వేడుకల్పొసఁగఁగా నిచ్చెట్టులట్టందఱున్. ౭౨

కం. అని తెల్పిచనియెఁ దననెల
వునకుం దామరల పుట్టువుం దగ జేజే
ల్మనికిం బట్టులఁజేరుడుఁ
దనఁవలసిన దెసకు నేలదారెంబ్రీతిన్. ౭౩

వ. అంతనొక్కనాఁడు. ౭౪

సీ. పల్లజడల కెంపుఁబ్రామిన తిరివాఁడు
పొరొగిరంబుగాఁ బూసఁగువాఁడు
పటికంపుఁబూసల పస సరంబు గలాఁడు
చంక ప్రామిన్కుల సంచివాఁడు
తనకుఁదానై మ్రోయు దండెకఱ్ఱ గలాఁడు
ముత్త్రోవనీరాడు బత్తివాఁడు
బసుమంపుమైపూఁత బలువు మించెడువాఁడు
ముజ్జగంబులజోలి మ్రోయువాఁడు

గీ. వేలుపులచేని కొల్వులో వింతకతలఁ
జెవుల పండువుఁ జేయుచుఁ జెలఁగువాఁడు
మదిరకై నారదుఁడువచ్చి మాఁడువుపయి
నొంటిగాఁ గంసుఁడుండుట నోలిదెలిసి. ౨౭

వ. అచ్చోటుఁ దరియంజొచ్చి యక్కాళి వల్లఁబిల్పుఁగని యతం
డిచ్చు నూడిగంబులంది చెందిన వేడుకతోడ. ౨౮

ఉ. చివ్వలబువ్వ ముట్లనుచుఁ జెప్పెనునీవొక రక్కసుండ విం
దెవ్వరు నీకుఁజుట్టలు కుయివ్వను వేలుపు జంపఁబుట్టెనాఁ
డవ్వలుదక్క బందుగులు నాదివి కన్నెలు సామికొల్వుకై
యివ్వలఁగల్గినారెఱుఁగు మీ యదువు ల్బయలింటివారుగన్.

మ. పుడమి న్గాళలసంగఁ బేరయిన నీపొత్తుల్గిలారించి యె
ద్దడిచేమగ్గెడు మంచివారిఁ జెఱుపం దప్పించి జేజేలువే
డుడు విన్వారిని గూల్పుపూన్కి సిరిచేడ్కన్ రెండువేల్గన్నులన్
నిడుపౌసామిని గొల్లడింటమరిపూన్కింబల్కినారొక్కటన్.

గీ. ఇది నిజంబునమ్ము మేఁబోయివచ్చెద
ననుచు సాగి నడువ నడలి కంసుఁ
డతివ నాటి వఱకు నార్వురఁగనియుంటఁ
దెచ్చి వారి తలలు ద్రెంచెఁ బదరి. ౨౯

సీ. అంతట కసిదీర కాచెడు బాకివాఁ
డాడు తోడును దానిఁ గూడు మగనిఁ
దనయింటఁ గలిగిన తప్పకొట్టునఁబెట్టి
కావలి నమ్మిక కాపుల నిడి

తనపెదయ్య యనెడు తాలిమి దిగదొట్టి
యరిగట్టు లందుండ నప్పగించి
నేస్తుల తులువల నెఱినిక్కుతోఁగూర్చి
దొరతనం బమరిక దొరలఁజేసి

గీ. నేల నాలుగు చెరగులు నెమకి యుండఁ
దనకు మిగిలిన బంటు కన్దువులకున్నఁ
బెట్టుగానుండి బయలన్న యట్టిమాట
మదిని నాటుట వెన్నుని మఱవకుండె. ౮౦

కం. వలమురిదాలుపు పుట్టువు
జళుకున సైదోఁడు నాదు చానను బలుబా
మూలఁజెందఁ జేయునప్పటి
కొలదప్పని యట్లు కడుపుగుదిరె ముదితకున్. ౮౧

కం. అదిగని గుదెదాలుపుదొర
యదనిదెయని మదిఁదలంచి యతివను గావం
గుదురొదవిన దొకకర్జము
వెదకెన్ బెదురదురు లేని బిరుదై యుంటన్ ౮౨

కం. ఇదియేఁడవ చూలాతఁడు
చెదరించిన మీఁదసేయు చెయ్వులు జెడుటన్
మది వదలకుంటఁ దన్ను
న్వదలని తమినిల్పు చెలియవైపై పల్కెన్. ౮౩

మ. మునునే నొక్కఁడనై జగంబు గలుగిమ్ముం దెల్ప నీవప్పుడీ
మను నీరగ్గులఁ గాలి నాకసముల న్మల్పూను మేన్జేసి తెం

త్తని నీసత్తువ నుగ్గడింతు జనునా దండఁబునందాఁసముం
దొనరింపంగల దానిదెల్పెదను మేలొందంగఁజేయందగున్.

వ. అది యెయ్యదియంటేని. ౮౫

గీ. దేవకీదేవి చూలాని దింపి మంద
నున్నరోహిణి కడుపున నునుపువీూవు
తెమ్మెరల మింగుడుల దొరతెల్పివీూరఁ
బుట్టు నాకన్నయను రద్దివుట్ట జగతి. ౮౬

వ. అంతనక్కడ. ౮౭

చ. అడివిని యల్లరుల్జితుక నయ్యోను గాఁబని గుంపులాొచుఁ జె
ప్పుదురదినమ్ముఁవాఁడు పయిపూనికె చెల్లుటకేను నాపెలో
నొదుగుదు నీవు నందుసతి కోపిక కూతుర వౌదటన్న నె
మ్మదిఁ బలవించెసత్తి యది మానిచెనగ్గుదె దాల్పుమన్ననన్.

గీ. జాతరలఁ గొల్చి పజ మేలు చాముపనుచు
నుడువ జగమేలు మన నోడఁ బడియెసత్తి
యటుల గావించి నందుని యతివదొక్క
నెలకొనియెఁ దన్ను నెవ్వరుఁ దెలియకుండ. ౮౯

కం. కలిగెన్ రోహిణి కడుపున
బలుఁడగు కొడుకొల్ల వారు బల్లిదుఁడనఁగన్
దెలియఁబడె దేవకికిఁ గా
నలజడి జగములకుఁ బాసె నని పెద్దలనన్. ౯౦

కం. అదిగని కంసుం డులుకుచు
నిదియెనిమిది యైన చూలనేదే మపుడే

బొదిగి సదమదముఁ జేయుదు
బెదరిన గాదనుచుఁ గాచె బిడ్డనిపుటకణ్వ. ౯౧

వ. అంత నన్నవలామిన్న సన్నంపునడుము ఆకొమ్మదన్నబలి
యుటయు. ౯౨

సీ. మంటిపై పసగల్గ మగువకుఁ బగతురు
మంటలేరసి చెప్పు వగాడ్కినుండె
నీగాడు ప్రొద్దైన నెలఁతకు మార్తురు
బోరాడు వడిదస్సి బాగులుపడియెఁ
గనుపుబిత్తఱెక్కడై కనుపింపముగుదకు
సూడుల మేమాపు సొబగుఁగనియె
పిల్లబొల్లుడు గాలి బెట్టైన లేమకుఁ
బెరవారిలో వలి బ్రిదిలఁబాఱె

గీ. నాతినడుమున కలకలు నాటుకంటు
నడుము తుద మొదలెఱుఁగక నలిగిమెలఁగె
నైదుదయ్యాల చెయ్యాలయ్యాతివ కొదవు
నంత వెలుఁగుల వెల్గులో నణఁగిమణఁగె. ౯౩

వ. ఇట్టియెడఁ గయ్యాలయ్య మొదలగు వేల్పుజడదారులును
బదిపనుల నెక్కలం బొసంగు బొక్కవాలుగల వేగన్నుల
మిన్నయు మంచుమలకూఁతురు మే సగంబుగాఁబొసఁగు
ముక్కంటియు ముక్కిటనెక్కొన్న చదువులరాణిశోఁ
దాతయుఁదక్కఁగల జేజేమన్నవారునుంగలసి చనుదెంచి

నిండు వేఁకటం బొదలు బోటి నుద్దేశించి చేమోడ్పులర నొసటంగదియించి జోహారు లెచ్చరించుచు నిట్లని కొనియాడిరి.

సీ. పాలేటిరాదీవి పంచగీమ పరాకు
పచ్చపట్టొల్లె దాల్పా పరాకు
కడుపున జగములు గలదేవర పరాకు
త్రాఁచుమేపెక్కు-రింతా పరాకు
రెండైదువేసాల నుండుజాణ పరాకు
నలుచేతులమరు మిన్నా పరాకు
పొలదిండి మూకల బొడుచు దిట్ట పరాకు
కలుముల చెలియేలికా పరాకు

గీ. యతులితమూనిక మమరు జియ్యా పరాకు
కఱుకు కొలగుమి యెదురు చుక్కా పరాకు
పలుకుపూఁబోడి మగని యప్పా పరాకు
కాకరాచెలికందు సోగా పరాకు. ౯౫

కం. నాఁలుగు ప్రాఁజదువులు నీ
మేలిమితన మెల్లఁదెలుపు మేరలని గదా
నేలగల జన్నిగట్టులు
బాళిం జదువుదురు ముత్తెఁ బడయఁగ వేల్పా. ౯౬

కం. నీవెఱుఁగని దింతయు లే
దీవే పుట్టించిపెంచి యెగ్గునఁబొరయం
జేవనరుట దలఁపోయం
గావేరికి యాటలయ్యె గా నీకరయన్. ౯౭

మ. చిరనాసాటికి మించుగాకటుకుగా చే యెత్తి శాల్వోత్తిమో
పురహింపం గవిజేరి డెందము పెడంబాటింపగా నీక ని
న్గురిగాఁ దల్చిన పెద్దలేమెరిగిరో గొప్పైన నీత్రోవ త
క్కారులెవ్వారు నెఱుంగనోపుదురు మేలొప్పారు నీనిక్కమున్

సీ. ఒకఁడవై యంతవై యొకజోలిఁబట్టక
కొనకంత నీవయ్యె కొలము లేక
పేరూరు లివియని పిలువఁ దలఁపఁగాక
నిండు వెలుంగువై నెగడితొల్లి
సత్తి తాఁజేసిన జగములఁ గాపాడ
నప్పుడప్పుడు లెక్క కగ్గలముగ
నెన్నిరూపంబులో యెత్తితీ వప్పాటి
తెలియ మాతరమానె తిక్కవార

గీ. మయ్యె కనికరమొలయ మాకియ్యోడఁదెలి
వియ్యకున్న నినుంగన నేది త్రోవ
కడుపు వెలువడి కన్నులఁ గానుపించి
నడుచుపసిఁ దెల్పవే కల్మినాలిదయిత.

మ. మునుపీ పుట్టువునెల్లఁ బోవనెకదా మున్నీటిలోఁ జేపవై
మునుముచ్చొపాలదిండికోరకొనచేమోసంబునందించిప్రా
మినుకుల్వేగ మఱల్చి తెచ్చి నిదురన్మేల్గొన్న జేజేల పె
ద్దను జెందించితి వెంతజాణవో నినుం దండ్రీ గవంబోలునే.

గీ. కడలిమునిఁగినట్టి కవ్వపుకొండఁ దా
బేలవగుచు నెత్తిబెట్టి మోసి

యప్పుడప్పుఁదరువ నమరించి జాలేని
మందు వేల్పుమూక మన నొసఁగవె ? ౧౦౧

గీ. పుడమి చాపజుట్టి పొలదిండి కొనిపోవ
నోలి పందిరూపు నొనరఁదాల్చి
వాడిపంటజీరి వడి ఘంటచేడియ
గాచి తిర్గతమేలి కలిమితేఁడ. ౧౦౨

ఉ. బత్తునిమాటనిల్పుటకె బాగని రచ్చ వాజారమందు ను
బ్బెత్తగు కంబమందు సగమేర్పడు మానిసి రూపునంది మై
నెత్తిన సింగివేసమును నెక్కొనఁబుట్టి మెడాగిపట్టి గో
రొత్తి నరాలుదెంపి యసమూనితివా పొలదిండిఁజంపుటన్

చ. గొడుగును గోచిజన్నిదము కూరిమిదాల్చి బిరాననల్లదా
వుడు దొరజేరి జన్నమిడివోవక సాగెడుచోట నేల మూ
డడుగులుగోరి యన్నిదెసలాని బలిన్వెసఁగట్టి వైచి వే
పిడుగడి దంపువేల్పు కిడవే సిరి కొల్లగ లచ్చిదాలుపా.

శా. వేయంచుల్గలమేటి నిన్నుబాదుచన్ వేరాచబిడ్డైన చో
నాయంబూని పసిన్మరల్చి బలిమిన్ రా వానిచే గొడ్డటన్
మాయంజేయఁగజన్ని గట్టువయి సొమ్ముల్మీరు రామిన్నల
న్గూయన్పంపవె యిర్వదొక్కపరి నుగ్గున్నాచమైపోవఁగాన్

కం. పదితలలవాని జగడం
బాదవిన గుదులమర కుతుక లొక్కటతునుగ
న్నదనమునఁగూల్చి ప్రోయా
ల్మదమొదవఁగఁ దేవెఁదీని మొదలిటిపుటకన్. ౧౦౬

గీ. ఇపుడు తులువల యుల్ల ముయ్యేలలఁబోలెఁ
దూఁగ నీ జవరాలికిఁ దొడరిపుట్ట
గాఁబునందుండి వెడలు మో కల్మిఁజేఁడ
దండము లొనర్చెదము నీవె దండమాఁకు. ౧౦౯

వ. అని కొమ్ము సింగాణిం బూఁగడి ముక్కంటి మొదలైన వేల్పులు యమ్మగువం గనుంగొని యిట్లని వక్కాణించిరి.

శా. తల్లీ బూజ్జకుఁ గేలుమోడ్చెదము మేల్గాపించెమా మాటలుం
జల్లుల్గా విఁతఁ డేలికందఱకు మున్నాలంగ నోముం జత
ల్లొల్లల్గాఁ బచరించినా వవియె గొంకుల్మాని నీకిచ్చె నీ
చెల్లుంబాటును బాపురే పులుఁగు డాజ్జేజేగనం గల్గితే.

గీ. పోయివచ్చెదమమ్మ యీబూరగొమ్ము
సామిదెల్పెడు వరుసపై జరుపుమనుచుఁ
జెప్పి వారిండ్లకడకేగి రుప్పరమున
గుడుసువాల్బూమె లొత్తిలినెడువుకొనుచు. ౧౧౦

సీ. కాకరాసింగంపు గదిసిల్చివెలుగొందు
నెలపున్నమకు వెలినెలవుకొన్న
యేడొక్కటగునాటి మూఁడవకేజాము
ముందఱ నలువరిక్కందగు తఱి
సోకుమూఁకలగొంగ చుట్టు వాల్సంకులుఁ
గుదెకొమ్ముసింగిణి గొప్పకత్తి
నాలుగుచేతుల నలువొప్పబంగారు
పంచ పచ్చలతాళి బటువుపేరు

గీ. లోపుగలసామ్ము లెన్నని మెడలమెఱయ
నబ్బురంబైన వెల్గు మిన్నంది వెలుగ
పైఁడికడుపయ్యఁగన్నయ్య పాపఁడయ్యె
నెయ్యెడల నెవ్వరిట్లని యెఱుఁగకుండ. ౧౧౧

శా. రిక్క ల్మిక్కుటమైన తెల్విఁగనియో శేరాపగల్సాముల
న్వక్కల్గప్పెడు కాపురుల్వదలెఁ జెంపల్సొంగె మున్నీరులా
చక్కన్మబ్బులు గుబ్బటిల్లె పిడుగుల్జల్లించుట ల్మానె పెం
పెక్కన్నద్దెసలాగి కమ్మవలపుల్ హెచ్చాయెఁ బెన్నయ్యెరల్

చ. అదిగని కన్నతల్లి కొడుకా యని చేతులసందుదారి మే
న్మదిరి పరాకులేక కనుమూయక తప్పక చూచి వేడ్కలోఁ
గదురగ వేఁడె నీమొదలికర్జము లెవ్వడెఱుంగుఁ జేవరా
ముదుకలకెల్లను న్మొదలిమోసు వెఱంగిఱ నిప్పుడెంతయున్

గీ. ఆడుదానఁ బొగడనలవిరొ మీఁతొలి
పోకలెల్ల కాలిపోకలేని
గాలికూటి మేటికయ్యాలమేపరి
యున్నకైన దూరమెన్ననఁగ. ౧౧౪

గీ. కాన కనికరంబుగల్గ నన్నన్నింపు
మేదినోచి కంట నెఱుఁగనుమ్ము
కొడుకవనుచు నిన్నుఁగోరికెఁ బెనుప నా
కేది తెరవు కంసుఁడెట్లు తలఁగు. ౧౧౫

ఉ. చిమ్ములురాల్చు చీచెడుగు చేయాడిదం బెపుడండబాయఁ డీ
హెచ్చుజెడంగ నేపగిదినేఁ జరియింతునొ దెల్పు కండక్రొం

బుచ్చుల నీకనుంగొనలఁబోలఁగఁ జూడఁగలేను దేల్వినా
కిచ్చిపడచ్చువటి పసియీాడు దటాలునఁ జూపు మ్రొక్కెదన్

వ. అని వేమారు తల్లివేఁడుకొనుచుంట వసుదేవుఁడెఱింగి పుట్టిన బిడ్డనికా జూడ పురిటిగీము మోసాలనుండి చని నీరాడి వేపాడి మొదవుల జన్నిగట్టులకిచ్చెద నని వాక్రుచ్చి యచ్చోటుదరలి పాపనింగాంచి మోసులెత్తినబత్తి నల్లనయ్య కల్లనల్లన వలగొని వెనుకటినడవడులం బేర్కొని కోర్కెదీరం గొనియాడుచు నోయయ్య కుయ్యాలింపు మియ్యెడనేనేమి జేయవలెనో యెఱుంగమఱుంగుమానికస్వరువైన యీామొదలింటి బూమె లుజ్జగించి యొజ్జవై తేటగా వివరింపు మని వేడుటయు నాపక్కి నెక్కుడుసామి మక్కువ మిగులుగని నాకీపుట్టువున కీవప్పవగుట నీకుఁజెప్పెద నెఱుంగు మీాపును నీయిల్లాలునుం దొల్లి కల్లుడిగి యిల్లువెడలి యడవి నిడుమలంబడి యాకలంబులుమెసవి తపసులైన మెచ్చి నేవచ్చి కోరికలనిచ్చెద ముమ్మాటికి మీామెచ్చుట మందలించండి యనియడిగిననడుగులంబడి తడబడక మీారు నన్కొడుకుఁగావలయునని యడిగితి రదివిని నేనునట్లగుటకుం బాసయిచ్చితిఁగాన మువ్వూరు మీాకొమరుండగుటకొప్పిన కతంబున నింతకుమును రెండప్పులు దీర్చితి నిదికడపలి యది యికమీాఁదట మీాకునుమీాయందునాకునుం బుట్టువు గలుగదని తొల్లింటికతఁజెప్పి యిప్పుడేకొలఁదినడుచుకొనుటకుం దండ్రికిం గరపి చిరుతపాపండై యరుపుసాగించిన నాశౌరియు నావెన్నుం డన్నవెంబడి జరిగించుకొనుటకై

బొట్టినట్టి పట్టిపోయిన నెడబాయలేని తమకంబుననొకింత
ఎడి తల్లిసంకటపడి యంతటం దెల్వి నెలకొల్పుకొని కొం
పొమ్మాయని విడచి తొలగి యూరకుండె నంత వసుదే
వుండు. ౧౧౭

కం. బిడ్డని బ్రొమ్మునని చన
నడ్డంబైయున్న తలుపులంటిన గడియల్
దిడ్డులుదీయుచు విడుపడు
పడ్డప్పటివలె నమర్చి బడిబడి నడచెన్. ౧౧౮

గీ. త్రోవ వానముంపఁ ద్రొక్కుటపడకుండఁ
బడగలాపి చిలువయొడయ డరిగి
నంత జముననిండి యసలెత్తి పారుటఁ
గాంచి శౌరి మదిని గస్తిబడియె. ౧౧౯

వ. అదిగని. ౧౨౦

గీ. చదలు వాకసవతి జమున యీపాపని
మొదలుదెలిసి పాసె ముదము గదుర
నడచి దాటె శౌరి వడిపాపతోఁ దేగ
నందుపల్లెఁజేరె నాడె శౌరి. ౧౨౧

ఉ. అంతకుమున్న నందునకునయ్యెదఁగూఁతురనంచు వెన్నెలో
మంతనమందునన్న తొలిమాయ ఘనింబరికించు పల్లెలో
సంతనగా యశోదయనుచామకుఁ బుట్టె నెడల్లెలుంగరా
క్రంతల నిద్దురన్మునిఁగి కాపొకనువారలు మైకమబ్బినన్

వ. అట్టియెడ వసుదేవుండు. ౧౨౩

ఉ. పోయి బిరానఁ దానుగొనిపోయిన కుఱ్ఱని యాపెపక్కలో
దోయిట నెత్తిపెట్టి కనుదోయిఁ దెమల్పనివారి లేవఁగాఁ
జేయక దానిబిడ్డగొని చెంగున జేరి యెఱుంగఁజెప్పి వా
పోయెడు దేవకీతెరవముందర డించి తలంగి గొబ్బునన్

కం. అటులరిగి తానునిలిచెడు
కటికియిరుల చప్పరమునఁ గాలూనియు నె
ప్పటి పగిది నుండెఁ గతలిం
కెటులోయని యరసికొనుచు నెఱుఁగనిపగిదిన్ ౧౨౫

వ. అంత మీఁదట.

కం. ఆపాప పెద్దఱంతుగ
వాపోవం గాపువాఁడు పడిలేచి కసెం
దాపునకరిగియుఁ గంసుని
లేపక ముందెటుల మనకు లెస్సని తొరతోన్ ౧౨౬

కం. దేవర యీసరిప్రొద్దున
దేవకిసీల్లాడె నేగుదెమ్మని వేగ
ల్లావరుసదెల్పఁ దూగుచుఁ
జేవమెరసి పురిటికొంపఁ జేరం జనియెన్. ౧౨౭

గీ. ఇంటికాపువారిఁ గంటగింపుచు దిట్టఁ
జాగుసేయుటెట్టి జాడమీకుఁ
బొగరు మించెననుచుఁ బోనాడి చిఱుతను
బట్ట నెదుటనిల్పి పలికెఁ జెలియ. ౧౨౮

మ. అకటాకూఁతురు నీకుఁగోడలిది నాయంబా మొగాతండుగా
డు కరంబల్గి కటారునంబొడువ గీడుఁగారాద యీయాఁడుచే
సెకలొల్కఁగను దమ్ము లెత్తెదవు చాజ్జేమెట్టులా డీపె న
త్తుక దెంపం గలదేయసంబు మివులందోసంబురా యన్నయా

వ. అదియునుం గాక.

కం. సరకుఁ గొనకెంతవారి
న్బొరిగొనెదవు దానఁ గీడుబుట్టెఁ జెడుగా
సిరిమగనిమీఁది యలుక
న్దరిగెదవే యీఁడుదాని తగునె విడుమవత్. ౧౩౩

మ. మగువాయెడిటిమీఁదిగాబుదరుగు న్మంమ్మంచువిన్నున్నబ
ల్కఁగ సీవక్కడలేవె న్నాబ్రతుకు ప్రీలన్జేయఁ గైబాట పు
న్వగల న్బెర్చిన నమ్ములెల్లు తలద్రెవ్వన్ద న్నెద న్మారు జె
ప్పఁగమోసంబగురాకుమంచుఁజెలినొవ్వన్బల్కి వాఁడత్తటిన్.

గీ. పుట్టుకంముఁ జేతఁబట్టి మీఁదికినెత్తి
కీళ్లు దిరుగమొత్తి గిలకలొత్తి
బండమీఁదఁ జాకిబట్టఁ గొట్టెడురీతి
గుండుమీఁద జబిరె గండుమిగిలి. ౧౩౪

కం. ఆపిన్నదిజాపైఁబడ
కోపికమిన్నంది వేల్పులొగిఁ దను మునర
న్బాపజ్జవరాంధ్రుడు గొలువఁగఁ
బ్రాపునఁ గాన్పింపఁజూడఁబడ కంతటిలోన్. ౧౩౫

గీ. కంసుతోడఁ బల్కఁగాఁ జొచ్చెనోరినీ
గెడపు బలియుఁడొకఁడు పుడమిఁ గలిగి
పెరుగుచున్నవాఁడు బీదఁనన్నూల్పఁగ
తరముగాదు తెల్వెదప్పెనీకు. ౧౩౬

క. అని మింటఁబల్కి మొదలిటి
దనఁ దనరినసత్తి మాయమై పోయిన గొ
బ్బున నింటికేగి తనకు
న్జనవరులగు వారిఁబిల్చి సందియపడుచున్. ౧౩౭

కం. మంతనమున నిట్లనె నీ
వింతలువిన మెన్నఁడరుదు వినుకొగసి కటా
పంతముగ నన్నుఁద్రుంచెడి
సంతువాఁడమె నంచు సత్తి సాటించె వినన్. ౧౩౮

సీ. ఎగ్గేమి సేయలేదెన్నఁడు సిరిగూర్చు
మగనికి నామీఁద బగఁదలంపఁ
దనకుఁదానే కంటు తనముఁగడించెఁజే
సెడిదేమొ కానిమ్ము చెరుపఁగలఁడె
మదికి వచ్చినయట్లు మఱిమఱిగావింతు
నెట్లన మంచిదై యేపురేగి
పల్లెలు వీడు లీపనిఁబూని మీఱేగి
చిన్నపాపలఁ బట్టి చెండివైవఁ
గీ. దండొకండైన దెగటారు నట్లుజెడక
నిలచిన మఱుంగు వేసాల బలియులఁగని

కడిమిఁగూల్చెఁడు బాపల గండడంచి
పొగరె గరనేడిపించు డిప్పుడమి నెమకె. 139

చ. మనపగవారిఁజేరి కలమంచి తనంబుగడించి పొంచుఁ డో
య్యన బలుదోసపున్గనుల నారసి కూల్చెఁడు సత్తిసెప్పిపో
యిన పినపాప నారయుచు నెవ్వరికిన్ న్మరుగందనీక రం
డనుటయు వారునట్లయని యాఁగిరినద్దిస లొక్కపెట్టునన్.

సీ. కోవెలద్దేవుళ్ళఁ గూడఁజెక్కలు సేసి
పెద్దలగీముల పెఁకివేసి
తపసులచెంప లత్తలువేసి పడఁద్రోసి
కరివేల్పు గాఁపుల గాసిచేసి
జన్నముల్దగుచోటులన్న రోతలుగూసి
చదువరులను గాళ్లజమిరి రోలి
జన్నిగట్టెదురైన సరిమొగాన నుమేసి
కల్లరుత్తమవారి గాఁగడాసి

గీ. ముర నరక బాణ శంబర బకాఘ
వత్స కేశి తృణావర్త వక్త్రదంత
పూతనల గోడు గుడుపుచుఁ బుడమిదిరుగ
రొమ్మునడతల దొరతల ద్దిమ్మదిరిగ ౧౪౧

వ. అంతనిక్కడ నక్కడలి రాచూలినక్కునందిడిన రాయండ
క్కరనెంచి యశోదపక్కంజేరి యెక్కుడు రొదపిక్కటిల్ల
పక్కలెగర నెక్కెక్కి యేడుపుసాగించిన నాయమ్మయు
సొమ్మసిలియుండుటఁ దక్కి చక్కని బిడ్డదక్కెనని నెక్క

నని వేడుకం జూచుతఱి నచటితొత్తులెత్తెత్తి కాళ్లెగర నడు
చుచు మొగబిడ్డ మొగబిడ్డయని సంబరంబులు సేసుట
లాలకించి మేలుమే లమ్మలక్కలారా చూచివత్తమువత్తు
రే యని యత్తఱిఁ బల్లెగల చేడియలు తత్తరంబున నత్త
వదినె యేరా లక్కసెల్లెండ్రు వేర్వేరం బిలుచుకొని వచ్చి
పసపు నూనె చెందిరంబాకు వక్క మొదలగు కానుకలు
దెచ్చి యచ్చోట నునిచి బొట్టిడువెట్ట నీరాడించి గన్నమ్మ
గలపి యప్పటిసంతసంబున బాలు వెన్న మీఁగడపెరుగులం
జల్లులాడి పల్లెవారు యిల్లుసేరునంతకుఁ దొలిసంతుగలుగు
వేడుకఁ దానంబాడి నందుండు నేల జేజేలకుఁ దొడుకులు
ముడుపులు తెగువమిగులఁ దేగంబుగావించియప్పిన్నయ్యఁ
దాతఁగన్నయ్యఁగాఁ దలంచియిట్లని కొనియాడఁదొడంగె.

క. తొలిపల్కు లెఱుంగవు నీ
కలరూపటులైనచోటఁ గనుఁగొన నే గో
ల్లలలోని వాఁడ మొఱకుఁడఁ
దెలియఁ గలుగుటెట్లు పుట్టి తెంతటి పనికో. ౧౪౩

క. జగముల నేలెడి ప్రోడవు
జగములు వోఁజేసి వెనుకఁ జక్కని వెలుఁగై
నెగడెదు పెంజీఁకటి గ్ర
మ్మఁగ నీయకచూడ నెట్టి మాటో మొఱఁగక. ౧౪౪

చ. తొలితొలిబాముల న్మదిఁ దూరిచి మీయడుగుల్దలంట్రమొ
క్కులునవరించి దోసములు గూలఁగ నోములు నోచినామొ యా

వెలఁదికి నాకుఁబుట్టితివి వేడెద మమ్మిఁక నైనఁబుట్టుకం
బాలయకయుండజేయఁగ దెబొందులనెల్లముసంకుదాలుపా ౪౬

వ. అని వక్కాణింపుచు.

సీ. ముమ్మారు వలఁగొని మ్రొక్కి విన్నపముగా
మనవి జెప్పిన సిరి మగఁడు వలికె
మును పు జేజేలపీటను వసువులలోన
ద్రోణుండవీవు నీ తోయ్యవనడచు
పాలఁతుక ధరయనఁ బొలుపగు నిది మీర
లిద్దరు ననుగూర్చి యెన్నఁగాని
నోములు నవరించఁ బ్రేముడినేవచ్చి
తలపేమి యన మాకుఁగలుగుమంటి

గీ. రేను నొప్పితి నటులని యిందువలనఁ
గొడుకనై తింకనెపుడు మీ బుడుతగాను
బుడమిఁబుట్టను మీరలీ బొందు వెడలి
ముత్తిజెందుదు రిది నిజమెత్తినాఁడ. ౧౪౭

మ. అని వ్రాకుచ్చిపరాకుదెల్పిన నతం డప్పల్కుల్లేత్రోవఁబో
యెనో బిడ్డండను బ్రేముడిం దగిలి గీమేగాములందంగ రా
దని గొప్పుల్వడిఁజేసిరా పొలఁతి చేతం బట్టి చన్దోయిఁ జే
రినపిల్లాతని గాంచి మిక్కుటపు గూర్మిన్మారెనొక్కమ్మడిక్

వ. పిమ్మట.

కం. పడవాళ్ళ బనిచె మందల
దొడుకులఁ గాపరులఁ బిలువ దొరయగు కంసుం

దుడుగరలు గల్గికొలందిం
బడిబడి గొనిపోయి రెల్లపట్టుల గొల్లల్. ౧౫౦

వ. అట్టియెడ. ౧౫౧

మ. దొరకేలేటనొసంగు పన్నిదుటక్కై దూకొన్న నందుండు సం
బర మేపారఁగ బండ్లపైఁ బెరుగునే బాలోపి సంతెత్తి ముం
జరుగం బల్లియవారు నట్లగొనుచుం జంటన్వడి గ్రాగఁ బ్రో
ద్దొరుగం గుంకుడు మెట్టపై దిగిరి తేఁడున్నట్టి ప్రోల్జేరువన్

గీ రేయి దిగినచోటఁ బాయలై పవళించి
వేగురిక్కఁగాంచి వేగ లేచి
తాము దెచ్చినట్టి తరిపిపాల్నేఁతులు
గొనుచు రాచనగరి గొప్పత్రోవ. ౧౫౩

కం. కొమ్ములు పూరింపుచుఁ జని
రమ్మానిసి జేనికొల్వుకంతటి మీఁదన్
సొమ్మరిజెల్లినమొదయఁడు
పొమ్మన సెలవొంది శౌరిఁ బొడఁగను వేడ్కన్. ౧౫౪

కం. మోసాలకాఁపరులు నను
డీసందున మనికియనిన నెంతయుఁ గడకన్
జేసన్న జేరికాంచెం
గాసిన్ నరిదప్పియున్న గాదిలియనుఁగున్. ౧౫౫

చ. కనిచెలిమెంచి నందుడనుఁ గంటగు కంసునిచే నలంగియుం
జనువున మమ్ము మదల్తువని సారెకువిందుము మంచిదయ్యెఁ గం

సునకరిచెల్లెఁ బొమ్మనియెఁ జూచెద మిమ్మనిచేరినాఁడ నే
మని సెలవిచ్చెదో తెలుపుమన్నఁ జెలి న్వసుదేవుఁడర్మిలిన్

కం. కౌఁగిటఁజేరిచి లెస్సలె
లేగలు నాబసులు చీడలేదుగదా మె
ప్పొ గౌతము నీయుం బసి
కేగిన దెస నిండఁగలదె యేనాఁడడవిన్. ౧౫౭

కం. సంగాతికాఁడ నాప్రబతు
కంగిట పుండాడఁగూడ దలసుఁడు బోజుం
డింగలముఁబోలు చూడ్కిన్
బ్రుంగింపగ సేమమెట్లు బొసఁగు స్దలఁపన్. ౧౫౮

ఉ. పుట్టిన వారి నాకసము బోరునఁ బల్కిన మాటఁబట్టి చాఁ
గొట్టిన వీటి వోయిరిది గొట్టనకేచి చెలిన్ననుం జెరం
బెట్టి కలట్టి చుట్టముల బింకము మానిచెఁ గాలసంకెలల్
గట్టి నికేది త్రోవ యరికట్టుమిదొట్టునఁ జెట్టవోవఁగాన్

శా. నామీఁద న్నెనరుంచి వచ్చితివి దీనన్నాకు వేడ్కయ్యెబో
మీ్మా మీఁదం జెడురక్కసుల్ద్దిరుగ మీకీచక్కఁ బెన్కుఁడు లె
న్నో మోసంబులుగల్గుఁబొమ్మనుడుఁదానుపొంగినందుండు కీ
డేమీ గల్గదు దీవనల్పలుపుఁ డేన్ప్రొద్దు మేలందఁగన్,

వ. అనినపిమ్మట. ౧౬౧

గీ. ఇట్లు వల్కినందు నెంతయుఁ గూరిమి
గారవించి శౌరికరుణఁబల్కె

నిన్ను దండ్రివనుచు నెరనమ్మి నాకొడు
కున్నవాఁడు మందనుండి తెలియు. ౧౬౨

కం. అనియిట్లాడిన నందుం
డను నాకొమరుండు నీకు ననుఁగుఁగొడుకుగాఁ
జనువున నాసెదరే యి
ట్లనుకొనుఁడని యింటిత్రోవ నరుగుచుఁ దనలోఁ. ౧౬౩

ఉ. ఉప్పలు లేమొగల్గునని యోడఁక చెప్పఁగ దాయతండు మీ
దెప్పని యెట్టులాలెఱుఁగు నేయెడఁ బ్రొద్దులువుచ్చి పోవఁగా
దిప్పవ లేగులోపలనె యేగుదమంచు హుటాహుటిన్ జతల్
దప్పి పొలంబు చాయలనె దండడి పల్లియ కేగి రంతలోఁ.

ఉ. బల్లిదుఁడైన కంసుఁడటు బంపిన రక్కసి గుంపులోన ప్రే
పల్లెకుఁ జేరి యొక్కముదిపంద జెడన్నువపూతనాఖ్య జా
బిల్లి కొలంబునంబొడమి బీదలనొక్కను వారిఁబ్రోచు పా
న్పల్లియదాల్పుఁజంపుటకువచ్చెనుమందులుగాంచుమైదులోఁ.

క. మెల్లన గొల్లలపల్లియ
నెల్లంబరికించి నందునింటం బిలగా
డెల్లరు వినవేద్పుటఁగిని
చెల్లించెద వీనినను చుఁ జేరెన్వడిగన్. ౧౬౬

వ. ఇట్లమ్ముసుకరక్కసిరా లక్కజంబైన మైదుచక్కదనం
బమర నిద్దంపుటద్దంబుల జిగిదెగడు జెక్కులును నిగారించు
దుగముక్కాలిపుర్వులనిక్కలు దక్కంగొను ముంగు

రులును దామరకులుకలోలుకు గన్నులును నరచందురు
విరిపి మొరికిసేయు నొసలును నువ్వుబువ్వులనవ్వు చక్కని
ముక్కునుం జింకదాలుపు బింకంబు నంకించు మొగంబు
నం జిరునవ్వులయు చుండఁ జెంగల్వతావులకుఁ దావ
లంబగు నెమ్మోవి యెమ్మె బయలువడుచుండఁ బైడికుండల
గండునండగొను గబ్బిగుబ్బలయుబ్బరంబ బబ్బురం బెల
యింపఁ జదలేటి మిసమిసయిసుము కుదురునదలించు పిరుదు
లగుదుజూపరకుం జూపుతొగరు కెమ్మోవి కమ్మతమ్మ
లంబు వలపుఁగ్రమ్ముకొన వన్నెగల బన్నసరంబులన్గలసి
మెలఁగు చినుకపూసల సరు లవుత నెరతనంబుజూప జిలుగు
పలువన్నెకట్టుపట్టంపు పైచెరంగట్టిట్టుదొట్ట నలెవాటుగాఁ
జుట్టి యశోదమ్మ పనులఁబడి యట్టిట్టుదిరుగుటరసి బొట్టె
తట్టుజేరి యోరబ్బా యోబ్బాయా కొంటిపిచంటి పాల్ద్రావు
మాపులింతలేల యని సిదురగదిరి నట్లుండి పండిన నల్లనయ్య
నెయ్యనపక్కంబాపి డొక్కంజేర్చి మిక్కుటంపు వేడుక
నక్కునకెత్తి పాడి పీడి చావు మందిమిడిచిన గబ్బిగుబ్బ
దెబ్బన బయలుపరచి పాపనివాకరపించి పీల్చుమని కను
జెప్పమూయక చూచుచుండ నాకుఱ్ఱ యుఱ్ఱుసాచి సిగబిగు
వుగాఁ జేసమరించి యాచంటిపాలాను నెపంబున వంటి
నీరంటి రాపల్కుడుటిమోపున తేపతేప కావెరూపర జుఱ్ఱి
నాచిఱ్ఱితల యోవెఱ్ఱిబిడ్డా వదలుమని వాహోయిన నాపక
గఱ్ఱుగఱ్ఱున దేఁపుచు మోపుజేయ మంటలంటి కంటగిం
చుచు గెంటఁజాలక మేనెల్ల నివిరి యూఁపిరితాపిరించక

కూయుచు రాకాసియై నేలంగూలి కాలుంజేయాడించు
టలు లేక మడిసె మఱియును. ౧౬౭

సీ. ముక్కంటిచేవాలు మొనలౌరగొగ్గి పం
డ్లిగిరినభావుల నెనయుకండ్లఁ
జంకలంటుక బొడ్డుసరికి సాగినచండ్లు
గొండబోటులకుద్ది గొప్పబొండ్లఁ
జింతనిప్పులపోల్కిఁ జెప్పుజుంజురు కొప్పు
బండికందెన మేనిబంకకప్పుఁ
గొక్కరచందంబు గూనివెక్కటియొప్పుఁ
జిన్ని సందులగొంకు చెవులరప్పుఁ
గీ. గలిగియ త్తిగఁ గ్రోసులఁ గ్రమ్మియున్న
మానులును రాలు పొడిగాఁగ మడిసి పడిన
పాడురాకాసిఁ గనిరి గ్రేపల్లెనున్న
గఱితలందఱు గడగడ కళవళించి. ౧౬౮

వ. తొక్కటపడు నడరునందు. ౧౬౯

శా. జాలింబొంది వగల్కొ మల్నెరప నాసామ ల్వడిన్వచ్చి పె
న్గాలింగూలిన వింజమొక్కయిదినాఁ గాల్సేతులున్నేలపై
సోలంబుచ్చినదానిఁ జూచి వెఱతో సొక్కెత్తి నోరాడ కు
య్యేలల్బ్బని మెడందలఁగ్గలిగి మీఁదెట్లంచుగోడాడుచున్

ఉ. ఈపెనుదయ్యమెక్కడిది యెవ్వరిపంపునఁ బారుదెంచె నిం
దేపగిదీయొడల్బడియె నెవ్వరు మొత్తిరి సావ పాపఁడే
డీపలుగాకియొండొడిచి యెగ్గొనరించెను చెప్పుఁడన్న నా
ల్గాపరిపేరటాండ్రనిరి గత్తరతత్తరమేపురేపఁగాన్ ౧౭౧

సీ. మదిరకు మీఁరేగ మరునాఁడు రేపడి
యెడ సొబగొప్పార నేగుదెంచి
నల్లనయ్యను డాసి నాతండ్రి యాకొంటి
విచ్చేదఁ బాల్ద్రావు మిప్పుడనుచుఁ
తొడలపై నిడుకొని దూబ యీరక్కసి
వల చన్ను గఱపింప వాబిగించి
గ్రుక్కగ్రుక్కకు మేనుసొక్క నెత్తురు ద్రావి
వడి గోడు గుడిచిన విడక పీల్చి

గీ. యొడలి పెనుగాలి వెడలించెఁ గొడుకుఁ గుఱ్ఱఁ
డాపె రొమ్మునను న్నవాఁ డతనిఁ దెచ్చి
బెట్టులోఁ దగఁజేయుఁడంచింతు లడల
వెఱగు జెందిరి గొల్లలు వింత యనుచు. ౧౭౩

వ. కొండొక తడ వట్లుండి యంతఁ దెలివి దెలుపుకొని
తాల్మియుం జెల్మియుం బైకొనఁ బిల్లకిం దీసి తల్లికిచ్చి
యొక్కపెట్ట నందఱు గండ్రగొడ్డండ్ల మోటకత్తులఁ గడికం
డలుగఁ జిదిమి మేల్జావలకు తావలంబైన యడవిమ్రాకుల
నఱికి వాము లమరించి కాడు గావించి యందగ్గలంబైన
యగ్గిం బ్రేరేచి రవులుకొల్పి యందుఁజేర్చి రొడ లపుడు.

గీ. దానియొడలు గాలుతఱి మంచి వలపాపె
నన్నికడల కంపు లంత వారు
దోసకారియొంట దొడరు బెట్లీ మంచి
వలపటంచు వెఱఁగుపడిరి కూడి. ౧౭౪

కం. కొడుకు దనఁ చేతిలో నిడి
మిడుకుచు నారేని బడఁతి మెత్తనిపెండ
న్గడు దయ్యాలఁ జదువుచుఁ
దడఁబడుటలు మాని నిల్వఁ దాలిమి కతన౯. ౧౭౫

కం. చచ్చెడు మందిడు చానకు
నిచ్చె న్మెలిక్కఁజేరి యుచ్చుఁ జరింప
న్లచ్చి మగనిఁ గని పెంచిన
మచ్చెకనుల తల్లి కెట్టి మచ్చిచ్చెనొకో. ౧౭౬

మ. ఇటు లెల్లారుఁ దలంపఁగాఁ జిఱుతబిడ్డేమంటెనో గాములం
చటకుం జాపలఁ బిల్వఁబంచి తొలిపల్కాడించి వేనోళ్లను
క్కట బల్దీవనలంది వారి కిడియొక్ గైసేసి పాలిచ్చు నా
తుటుము న్వోయిఁటినంపుఁడిచ్చె సిరి దోడ్తో గొప్పలో నుప్పఁగ౯

గీ. నల్లమేసామి పుడమిలోనవి జరిపిన
కతలు జడదారిచే విని కాన కంతు
కఱ్ఱిమనుమఁ డామీఁదటి కతలనెల్ల
నానతిమ్మని వేఁడె నెయ్యంబు నెరపి. ౧౭౭

కం. వలిమలరాకూఁతురి పొ
త్తులవాఁడా వెండికొండ తొలి బోడిల్లై
మెలఁగు పిపాసుల తేఁడా
పలుకొమ్ముల మెకము తిత్తిబట్టగు వేల్పా. ౧౭౮

ఉ. బొల్లిమొగంపుఁ బక్కిదొరపూనెడు వెన్నునిజోడుకాఁడ మి
న్వల్లెలముండు పోటరులఁబట్టి వెఱంబారిగొన్నదిట్ట పొ

న్మల్లెల తేని నేస! యిరుమోరలదేఁర చందు్రపొద్దు క
న్గల్లలుగాఁబూసంగి మలకూఁతురి నేలినబూఁడిదంటుడా. ౧౮౦

సుగంధివృత్తము. పాపతేఁడులెల్లమేనఁ బ్రాకిచాలఁగొంటులుఙ్
దాపలెక్కి పచ్చజన్నిదంబు వ్రేలి కుంగరా
లాపి కుత్తుకంటి వ్రేలునట్టి పేరులైతగం
గా పసిండిగట్టువిల్లుగా మెలంగు దేవరా. ౧౮౧

సీ. ఇవపుపెన్మలబిడ్డ మొకిమీఁవి నెనరుచేఁ
దోఁచిన యల్లిక దొలఁకువాఁడఁ
బాటిబండనుపేరఁ బరగు నిల్వాడి నొప్పి
పురుషోత్తమాఖ్యఁ బొంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు గెల్చిన
కతలన్నియును గూర్పఁగడగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబుఁ గలిగింప నమకట్టి
తిందు మొదటిపాళ మిటుల ముగిసె

గీ దీనిఁ బుడమివి నెవ్వరు తీపులొనరఁ
జదివినను బెరవారికి సరవి దెలుపఁ
దమకుఁ గామె సిరుల్ జేమఁ దలఁగుఁ గీడు
లట్టివారికి నల్లనయ్యనువు పరుప. ౧౮౨

మొదటి పాళము

ముగిసెను.

—•—

ఓమ్.

# కంసవిజయము.

## రెండవ పాళము.

కం. బంగరు మలసింగిణివలి
మింగుడు పాన్పమ్మునిడుపు మిన్నయగాఁడా
నింగి దిరుగాడుపల్లెల
పొంగడచిన పుడమితేరు పూనికవేల్పా. ౧

వ. విననొదల యొడ్డుము. ౨

గీ. మించు జోగిమొగము గాంచిరక్కసికూలఁ
గట్రినేస్తమెట్లుగాఁ జరించె
ననుచుఁ గడుపులోన మనిచినసామిని
వెదకురాచేఁడుగ వినిచె నతఁడు. 3

కం. మన్నించి తల్లిబిడ్డకుఁ
దిన్నని పఱపమరఁబఱిచి దీవనలొప్పన్
బిన్నయ్య పండుమని పని
కన్నెలఁతుక సాగరొప్ప నరిగెం బ్రీతిన్. ౪

శా. ఆయమ్మానలఁబోవఁగంసుఁడనువాఁడంపంగనే తెంచియు
ల్లాయంబోయి తెరిందలంపుచును దేడాలేక కాపుండి సం
దాయెన్నామలఁ జేయనంచు శకడాయూ దొడ్డరాకాసితాఁ
దాయుంగన్గొని కానట్టు లడగెం దాతయ్య కన్మోడ్పుతోన్.

చ. ఒఱిగిన మాయదారి చెడు గొంటముగాఁగని శౌరికాలి వే
ల్తుదఁబడఁ జాఁచఁ గండ్లిరుసు తోరపు పైపర మల్లఁ బెల్లుగాఁ
జిగురుపలయ్యెఁ దల్లడముఁ జెంది పొలందిను రాతుగూలనె
ల్లిద మొనరించె వేల్పుగుమి లేవడిమాటల స దడింపుచున్.

మ. బలురాకాసి బిరాన నేలఁ గలపం బాటిల్లె నాగుబ్బు జో
బ్బిలు పెంజక్కడు దానికిం జెవుడుగా బిట్టుల్కి కన్నమ్మద
వ్వాల కేతెంచి దిగుల్నొగుల్లలఁ పఁ జావుగన్న రేదిమ్మరిన్
బలుగాకి న్గని పోయి చెప్పి పిలచెం బల్లెంగలా గాఁపులన్.

గీ. వారు వచ్చిచూచి వకవక నగిపిల్ల
పాజ్జుసోకిచచ్చి తరిదిబిరుద
వనుచు వారిఁగూర్చి యాడుచుఁ కత్తుల
నొత్తిమంటఁగలిపి రొడలితిత్తి. ౮

వ. అటమీఁదట గొల్లలందఱుం గూడుకొని తమలో నిట్లని
తలపోసిరి. ౯

సీ. బండిపై మానిసి దండిపైకొని బిడ్డ
కాల్దాకి వడుపెట్లుగాటు పెద్ద
గాలియు విసరదు గడుసు లెవ్వారును
బోరాడి కూల్చిన చాఱలేదు
పెరవారలెవ్వారీ పిల్లదాపునవుండి
చూడలే దీదూడ్కి పీసమడిసె
మున్నాడి యుప్పెఁ కల్మొనయుఁ బల్లియ కని
తెలిసివక్కాణించె దేవకమ్మ

గీ. మగఁడు సెప్పుట నిజమయి నెగడసాగ
జిన్నబిడ్డల బ్రతికించుఁ జెలియలెట్టు
లనుచు వగచిరి మందయుం దెనయువారు
నరకనిమొదల్తొ దంటుల నెఱుఁగకుంట. ౧౦

కం. ఈఁదోకబాలునోడలం
బాదుకొలిపి పంచితంబు పైఁజల్లి యశో
దాదేవి కొమరునెత్తుక
చేఁదవుడుచు నోడలునెలమిఁ జెందెనడందన్. ౧౧

వ. అంతనొక్కనాఁడాయమ్మ కొమ్మలతోఁగూడ నింటిపనుల బడియుండి మఱచియున్న వెన్నునిమన్నిగొనంబాంచిపంచ నుండి రక్కసి మన్నితృణావర్తుం డనువాడు సుడిగాలి రూపున నేలదున్వ రేపి క్రొవ్వెగఁదొట్టి కవ్వడి చెలి నవ్వుటా లకుఁ బై కెత్తియెత్తుకొని జరుగఁగు రంగటివారు గారుకొని పేరురంబులు మోదుకొనుచు రోదసేయ విని తల్లితల్లడం బున నందు పిల్లనిం గానక డిల్లపడి యెల్లదెసలం జూచు చుండె నంతట. ౧౨

మ. సుడిగాలింగనురెప్పలెత్త నెడముఁజొచ్చంగఁ దావందమి న్గొడవన్గూలెడు వ్రేలఁగాంచి నిసువా గొల్లాతఁడీ పట్టున నడకన్గూపకయున్నఁజుట్టలు దిగుల్గారొక్కందురం చెంచిబా గొడియన్నానిసి దిండికుత్తుకను బెంపొప్పన్బిగింబెన్వడిన్॥

ఉ. చేతులగొంతు దొట్టికొని చిక్కితి వెక్కడబోదువంచుఁ జ
ట్రూతికి సూటిజూచి పడరా యని దిట్టతనాన నూకినం

బ్రాతరలాడి పై నిలువఁ బట్టఁగఁజాలక రక్కసుండు కీ
ల్గాతముఁలోనఁగూలి తలగన్వ్వలనేదక జిక్కియుండుటన్. ౧౪

కం. విలవిలఁ దన్నుకచచ్చెను
బలమరి సుడిగాలి సమసిపడినమెయి న్న
ల్లలవట్టు బారెఁగెంపులు
గల కాలువలనఁగ మంద కడపటినేలన్. ౧౫

కం. కాటుకకొండ తనంతట
పోటరినని మింటఁ దిరుగఁబోయునవేల్పు
న్మేటిపిడుగొత్తి మొత్తుడు
శాపైతెగిపడ్డ కొండగతినా నెరిగెన్. ౧౬

గీ. పడి తృణావర్తు డీల్గుట పరగఁ గాంచి
గడ్డికాపరు లలమట గీటువుచ్చి
పెద్దగొయిబోడిమునుగంగఁ బూడ్చిరచటి
మన్ను పెనుపూరికట్టియల్ కొన్ని నెరపి. ౧౭

వ అంత నా పట్టిం బట్టితెచ్చి యనుంగు జట్టంబులైన ముది
తెలివలుం దల్లియుఁ బొల్లి మోరపక్కి నెక్కుడు దంట
కంటె నేమొ గాములని కచ్చికబోతులిచ్చియు వేలిమిచే
వేడివెల్వు వేడుకొను నిక్కపు బొందళింపుటయ్యల కాన
తిచ్చియుఁ గాపుబెట్టి రవ్వల. ౧౮

సీ. ఒకనాఁడు గన్నమ్మ యోపికెఁ బెరుగొక్క
ఱుదురందు బానకుఁ గూడఁబోసి

తలఁజేతఁబూని వే తరువంగగమకించు
టఱసి పాల్దెమ్మని యడ్డగించి
యాపుడు వలదని యతివ మన్ననఁజెప్పఁ
బలుకులు చెవులకుఁ బాఱకున్నఁ
బేరల్కతోఁదల్లి బిడ్డనావలనూక
పెను దాతి బానకుఁబెట్టుఱవ్వఁ
గీ. జెక్కుతై యటి కంద లో నొక్కబొట్టు
చిక్క కట మంటిపాలైనఁ జేడె కనలి
పెట్టుకుంటివి పెరుగు నీపొట్టనను చుఁ
బట్టనతికత్తె వెంబడి పట్టి బరవ. ౧౯
వ. అపుడు
మ. ఇటుఁబోవ న్వారు వెఁటవచ్చు నటుఁబో నీమూఁలందాగు లేఁ
డెటులో తెప్పున దాటెనఁచవలఁబో హెచ్చ్రెష్పముందాడుచి
క్కుట విక్కంబని యడ్డవేగపడఁదాకుందోన బర్వెత్తుఁజొ
క్కటపుణ్గాదెలగంపలం దలుపుల న్గాలూఁపో నెట్టఁదాకో.
కం. పొంకమగు జగములను బఱు
గ్రుంకులు వెట్టించు ప్రోడ గునిసెడి తల్లి
న్వంకర కొంకర త్రిప్పులఁ
గ్రుంకిళ్ళం బెట్టు టఱుదె గునగున నడువన్. ౨౨
మ. ఇదుము ల్బెట్టకుమయ్య రారయని యాయిల్లాలు సేసాఁప నె
క్కుడుకూర్మి న్దగ ముందటన్నిలిచెఁ జేకొట్టంగ రాకాపె పెం
దుడుకా త్రిప్పటఁబెట్టి చిక్కితి వికెందుంబోవఁగాఁజాల వి
య్యొడనిన్గట్టెద ఱోలఁ ద్రాటనని హాయిందెచ్చెనచ్చోటికిన్

ఉ. తెచ్చి బిరాన నింటఁగల త్రిప్పుడు త్రాళ్ళు హరించి పట్టి వా
విచ్చిన నొవ్వఁజేతునని వెన్నుకు రోటికినంటఁగట్టి పె
న్నచ్చులు మానియుండుమని గాటముగాఁ జిడిసెప్పి బిడ్డపై
మచ్చిక జూపకేగె పెరిమద్దగజూతురె కొంటెలైనచోన్ ౨౪

ఉ. బొజ్జ యొకింత పెంపవనఁ బోఁడి బిగించినవజ్జ త్రాళ్ళు మే
వజ్జదొఱంగు టింతగని పల్పులు పగ్గము లాకుత్రాఁడులు
న్నజ్జగమూను దేవరకు మోపి బిగించినఁ దక్కువైన నా
గుజ్జరిఁ గట్టఁ జెచ్చెఁ దన కొంపఁగ నంబకు సన్నిత్రాఁడులన్

మ. అవియున్నక్కువయైనఁ దల్లి వగవన్ హాళిం బిసల్లుల్క మే
న్దవులంజుట్టిన నొక్కత్రాట నిమిడెన్నా విచ్చ మన్నించి మీ
దివియేఁడున్నతి క్రింది వేఁడగుచు బ్రోదింగన్న తానంబులో
ప్పవు బొజ్జబ్బగఁ గట్టఁ దల్లికసదే పాటింప నెవ్వారికిన్.

మ. పనులందోపిక తల్లిపోవఁగని చేవన్మద్దులై యున్న చ
క్కని లిబ్బుల్లలవాని బిడ్డలకుఁ దాకఁ బోరుకూడయ్యెది
ట్టును బోఁగొట్టఁదలంచి ప్రోల్లజఁపు చెట్లోవచ్చి యుడ్డంబుగాఁ
జనరెండై యవిదిగ్గువం బడియె నాసాముల్దిగు ల్లీలోక్క నన్.

ఉ. ఆరొదసోకి పల్లెఁగలయందఱు దందడివచ్చి చూచి యా
తేరులఁ బోని మ్రాఁకులఁ జెతెప్పనఁ గూలుట లెట్లొ పాపఁడీ
చేరువ కెట్లు పోయెనొకొ చెంతకు ప్రోల్పడి నెవ్వరిడ్చిరో
తోరపుఁ గత్తిగొడ్డళులతో నటకం గల గాట్లు దెల్పవే. ౨౮

ఉ. ఏదని యిచ్చనెంచుటకు నేర్పడ కివ్వలఁ దప్పుచుండి ర
ప్పాపులనుండి వెల్పడిన బత్తులు నెత్తికిఁ జేతులెత్తి మే

మీఁదితి మొడ్డునబట్టితిమి యిమ్మగుకాఁపురమన్న సంద్రపుం
బైదరి నీదుచూపులను బల్కులమబ్బినఁగాదె వేలుపా ౨౯

సీ. నిను గొనియాడంగ నేరరు వేదల
ల్గల పాప తేఁడైదు తలలవేల్పు
నలుమొగంబుల పోఁడ నా నెంతవారము
దలపోయ మేమలఁతులము సుమ్ము
తొలుత నీజగములతో నేమిపనిగోరి
పుట్టించితో వానిఁ బ్రోవ నింత
కెన్నిమారులు బాము లెత్తితివో యిపు
డీరూపు దాల్చుట కేతలంపొ

గీ. తెలియ దీవఱకీపాటి దెలిసె మాకు
నబ్బురంబైన చెయ్వుల ననువు పరుపఁ
జూచి విని చెప్పి మాబోటి శుంఠ లెల్లఁ
గట్టతెగి నిన్నుఁ గొల్వ నేగడ యని తుదిగ. ౩౦

గీ. దచ్చికడలేలు దొరలు నీదండనిలిచి
యరిదిపనులను సలుపంగ నెఱిఁగి మీర
లానుకొని రాకయుండిన దానఁ గాదె
పొలసుదిండుల చేఁ బడి రలమటలను॥ ౩౧

ఉ. ఒప్పనివారమైతి మొక యోరదొరా కలిమయ్య సంతునా
గొప్పగుకండ కొవ్వమరి కొంచెతనంబునఁ జేసినట్టి బల్
దెప్పరమైన చేతలు తుదిన్మఱద లేర్పడ విన్నవింతు మో
యప్ప పరాకు మాని విను మయ్య యిలం గడతేర్చు దేవరా.

ఉ. మింటఁజరించు వాకఁగలిమిన్దగువారల మాట నచ్చర
ల్వెంటనె జంటలై తెరల వేకయి రేఁగఁగ జల్లులాడఁ బోఁ
గొంగెలమై మొలంటులగు కోకలపోకల కొప్పియుంటఁ గ్రే
గంటనెఱింగి నారదుఁడు గార్కొనుపేరలుక న్మనుంగుచున్.

క. రొక్కము గలవారలమని
నిక్కుచుఁ జరియించనేల నెలఁతలతోడ
న్వొక్కస మబ్బినపెద్దల
పక్కల నోడుగుటలు మేలు బాటులు వినరే. ౩౪

క. గుఱిదప్పి మీరుదిసులై
పరువులు బెట్టితిరి సీటఁ బడి యీ నెపమే
సరిపోయె మిమ్ముఁడిట్టఁగ
నిరువురు మద్దులయిపుట్టి డిత్తఱి నేటన్. ౩౫

చ మద మెగదట్టి వేల్పువెల మచ్చికనుంగవ వారిఁగూడ మీ
రిదిసుత మద్దులై పుడమి నెవ్వదగుల్కొను మంటిమీదమీ
కొదవెడు కస్తిమాన్వఁగలఁ డొక్కఁడు కొన్నగు రేబగళ్ల కా
మొదలిటి సామిఁగాంచఁదుదిముట్టెడుసాపనమబ్బులన్నియున్.

క. పాయక మద్దులరగు మీ
చాయన్ జోలీడ్చి తెచ్చి సరిగుంజుఁడు బ
ల్కాయల మాకులు గూలుం
గాయంబులు లేకబోరు కల్గుచుఁ దొఱఁగున్. ౩౬

కం. ఆమానుల తొరటలు మును
గీములుగానుండు మీరు కీలెడలిన సాం

పాముకొను రూపు లలవడ .
మీామసికింబట్టులంది మెలఁకువ మనుఁడా. ౩౮

ఆ వె. అనుచు నుడివి మింటనరిగె గాణలమేటి
యంత చెట్టులెతి మింతవఱకు
బ్రతికినారమయ్య పాఱుని కనికర
మోపె మిమ్ముఁజూప నెండెఱుఁగము. ౩౯

వ. అని పెక్కువగల రొక్కంపుఁజేనిబిడ్డలు నలకూబర మణి గ్రీవులనువారు ముమ్మారు చుట్టు దిమ్మరి వలమురిదారి యడుఁగులంబడి బడిబడి సెలవంది దాపలివాలుగల కడకరిగి రిటదొడుకు పెనుఁపు లుప్పతిలు నుప్పలులలో నిదిగొప్పదని ముప్పరిగొను నడలున గోడుగుడిచి యందు బొందు సంకుగొట్టుడుల బ్రమందించుచందంబు నెందుంగానక నా పాక వెడలిపోక జోకయని ముందుండుట కవ్వలిచేదండ నుండుదెసకొండ దండనొండు పూరిగండుమీరి మెండుగా నుండు పసిమి కసవు బసుల కుబుసనియును జమున మొన కొను మడుగుల నీరు కారులేనిదనియును, బృంద యను యడవిఁ బులి చిరుత సివంగి మనుఁబోతు పలుగొమ్ముల మెకంబులు మొదలగు చెడుమెకంబులు లేవనియుం బేర్కొని యావులు తరిపిదూడలెద్దులుఁ గిత్తలంబోలుకొని యింటఁగలవంటపనిముట్టులఁ దొట్టులంగట్టిన బండ్లుఁదరలిం చుకొని కొమ్ము లెమ్మెలుమీరఁబూరింపు చుఁబసులగాప రులు రామకృష్ణుల ముందర నిడుకొని వెదురు క్రోవులు పెదవులం దవులం బాడు పాటల మోటుమావులు చివు

రుల నివురుకొన నలరుచుం జని చని బృందావనంబుచేరిక
విడుదు లమరించుకొనియుండి రవ్వల.

ఉ. నందుని పల్లెలోఁ గలుగు నాతులయిండ్లకేగి లచ్చితేఁ
డందర కన్నిరూపులయి యాగడపుం బనులెన్నొసేయ నా
కందువసేఁతలం గొమలు గట్టిగఁదల్లికిఁ దెల్పి బేర్జపుం
జందనుమాన్పఁగాఁదలఁచిచయ్యనఁజేరిరియామెఁగానఁగాఁ.

మ. మగువా నీకొమరుండు సేయుదుడుకుల్మన్నించిమేమెంతసే
పిగురంజేసిన నెక్కువయ్యె నిఁక మేమేలాగుప్రొద్దిగఁగా
నగుగద్దించిరెయొ మంచిమాటలనోపిన్నాతండు మాజోలిరా
కగుటెన్నిల్వఁదలంపుసేయు మెదలోఁగాకున్న రద్దేర్పడుఁ.

వ. అనిచెప్పిరయారేయి యూరకుండి మరునాఁడుం దిరుగవచ్చి
తొల్లింటిపనులెల్లకడల సళ్ళులేక జల్లించిన గొల్లచేడియ
లెల్లం దల్లిఁగని యిట్లనిరి. ౮౩

మ. తగవా నీకొమరుండు ప్రొద్దిటితటిం దావచ్చి నాబిడ్డనిం
డగుచూలాలినిలేప కేముపనిచే నాచక్కిఁబోకున్న మె
త్తగు దాపేర్పడఁగాఁ బరుండి యొకచేతన్జన్మొనంబట్టి పైఁ
దెగువన్ ప్రాలుడుఁ గూకవేయునదిమూతిన్గిల్లెఁబెన్గోరులన్

కం. నాకోడలు పంచం బని
తేకువనుండంగ వెన్కదెసకేగి వడి
న్గోకపయికెత్తి నఱచిన
నీకొమరుండుతికెఁ దగునె నిల్కడవలదే. ౮౫

సీ. ఇలుసొచ్చి లోనింటఁ గలుపుగడవఁ బెట్ట
యుట్టికై యెగఁబ్రాకి పట్టిదింపఁ
జాలక పీటల జతలెత్తు సవరించి
యెక్కి కడవవంచి యెక్కి పెరుగుఁ
బట్టెడు చేతితోఁ బట్టుకవచ్చి నా
తోడికోడలుమీఁద దూర్చిపాఱె
నదిగని మాయత్త యాబిడదొంగని
కొడుకుతో నేరంబుఁ గుదురఁ జెప్పె

గీ. నాతఁడాపడుచేడువ నాకు త్రాటఁ
గంబమునఁ గట్టి సెలగోల గదిమికొట్టె
బ్రతుకు సందియమటఁ గూలెఁ బడఁతివచ్చి
చూచి మాకిది తోఁగవని చూపవమ్మ. ౪౬

గీ. కొడుకుమూలానఁ బగలొనఁగూడుమనకుఁ
బిన్నకోడలు కడనుండ బెట్టుజరిగి
యంటఁబో ముట్టరాదన్నఁ గొంటెవాఁడు
ముట్టుచోటునఁ జేకట్టె మోపిచనియె. ౪౭

గీ. నామనుమరాలు నిద్దురచే మసలఁగ
దాని కురులకుఁ దఱపికిఁ దగ బిగించి
గిత్తరగఁదోలనీడ్చుక గిత్తజడుగ
మొత్తుకొనె నెట్టులో యిఁక ముదితచెపుమ. ౪౮

ఉ. చుట్టమొకర్తు మమ్ముఁగనుసొంపున వచ్చిన దానిపైటకొం
గట్టెబిగించి చేతఁ బాదమవ్వలబాటున కంచునీడ్వ నా

చుట్టులనున్న చానలది చోద్యముగాఁ బరికించి నవ్వి చే
పట్టుసడల్ప నాపడఁతి బావిఁగూలెనికెట్టు లమ్మరో. ౪౯

ఉ. కోకసడల్చినా యనుఁగుగోడలు సందునఁ దానమాడఁగా
నేకడనుండియో యుచటికేగి మఱుంగుగఁ గట్టుపుట్టముం
జేకొని పాముపామనుచుఁ జేరికఁగూసిన నెల్లవారలుం
రాకను నప్పుడంతి వెలిరా నెటులో వినఁజెప్పు మన్నవా.

కం. బొట్టియు జవ్వాది గట్టిన
పుట్టములోఁ దెచ్చివిసువఁ బోయిన యుళుకన్
ముట్టను తెమ్మని చన్నవఁ
బట్టెన్నేలంటి యిట్టి పనులొప్పులటే. ౫౧

ఉ. ముచ్చటమంచిదొక్కటిదెవబాల్గుముసెప్పెదనంచుబూతులం
దిచ్చిన నామకోడలవి యెక్కడి సుద్దులు మానుమన్నన్
గిచ్చితి వీడ నిస్వాడువఁ గేరడమాయని మోవినొక్కి వే
యిచ్చకు వచ్చినట్లు రికె నెక్కువలే యిటువంటి ఖైదముల్.

ఉ. చిన్నది నీదుబిడ్డ పలుచిక్కుల మాటలు నేర్పినాఁడు మా
కన్నియ కెన్నడో వలచి కట్టితి నోలి యదైవనిమ్ము గా
దన్నను దానిమ్మటల యాటకు గాదనెదేని నీవర
మ్మన్నవ యేలికాదునను నాగడ మాడిన నోర్పుబెట్టులే.

ఉ. పెట్టగ మేనమామ కొలపెద్దఱికంబును గూడు చీరలుం
దట్టముగా సిరిందనువు దయ్యము కయ్యము లాడవచ్చిన
న్నొట్టమెయంచు నెంచెదవు గొప్పగఁ గల్గినఁ గల్గఁగాక నీ
పట్టిని వాడపైవిడచి బాడుగు లప్పడలొంచెదే చెలీ. ౫౪

మ. అని పెక్కండ్రు నెలంతుకల్ చురుకుగా నాడంగఁదా ముద్దు
పట్టినిఁ దిట్టక జెడగొట్టఁగాక పనిబొట్టెక్ రట్టుగా నొక్కపె
ట్టున బిట్టల్లరి మాటలాడెదరు చుట్టుం జేరి మీవాడకై
చనుదేడెప్పుడు నీడనాడుఁ గద రే చాల్జాలుఁ బొండిండ్లకున్.

సీ. మీయిండ్ల కరుదెంచి మిమ్మందఱ నలంపఁ
బసివాఁ డెఱుంగ రే పడఁతులార
యిన్నిండ్ల కొక్కనాఁడే వచ్చెనని యందు
రిన్ని చోటుల కెట్టు లేగెఁ జెపుఁడ
యీపుట్టువునకు మాకీతఁ డెందఱు లేరు
చూచి యోరువలేరె సారిదిమీర
లాగడంబులు సేయు నంతటి యీడేది
సిగ్గేల గల్గదు లగ్గమీకు

గీ. వెన్నదొంగిలి తినెనని విసుకు లేక
వదరెదరు వెన్నఁ దిన నీడ పాడిలేదె
పొసగ దేమాట కేమాట బోటులార
కూటివలు గట్టనేల పొండేటిజోలి. ౭౬

వ. అని వారలనందఱ నదలించి మొదలింటి సామియగుకొడు
దుడుకుతనంబు లెఱుంగక యుండఁ గొండంబోలె బరువైన
బిడ్డని డించి కనుంగొనుచున్న యవ్వ యెదుట నాయయ్య
లయ్య యావులించి నీల్గిన. ౭౭

మ. మొగమందమ్మకుఁ గానుపించె జగములూమ్మఁడేఁడు నాల్గున్నసు
త్తగరులూడలుఁ బల్లెవారు దెసలుం దండైన పెన్గొండలుం

సిగమిన్నయ్యెయుఁ బైఁడికొండవిడుదుల్ సీద్రంపుపెద్దల్వగ
ల్పగఁడు న్మున్నగు గాములుఁ గలుగు పెఁ ద్రాఁడు
లొప్పదల్చెలయుఁ. ౫౮

వ. ఇవియన్నియుంజూచి. ౫౯

గీ. వెలుఁగుఁజెందిచూడఁ బరువైన కన్నులు
మూసి తన్నుమఱచె ముగుదతల్లి
యంత నోరుమూసె నయ్యబ్బి లేవయ్యెఁ
గానఁబడిన వెల్లఁగలయుఁబోలె. ౬౦

చ. తెలివినిఁబొంది నిక్కముగ దేవుడుపాపఁడుగాఁడువీఁడయో
తెలిసితి మాసియైనఁ గనఁదేటగ నెమ్మొగ మప్ప ళించినం
గలుగునె ముజ్జగంబులను గలెడు నిల్పుడులుం గదల్పఁలు
న్వేలుపల లోపలం గలుగు వేలుపుగా నితని న్దలంచితిఁ. 

కం. అనిబత్తి మీఱి వొదుగుటఁ
గని తల్లికి మబ్బుగప్పఁ గాఁజేసినదె
బ్బునఁ గొడుకయనుచు ముద్దులు
గొనియె నిదుర లేనికలలఁ గూరితిననుచుఁ. ౬౧

వ. అట్లుండఁ గొంతతడవునకు నాటలందిరిగి కూటికి తామఱ
చిన బిడ్డ నమ్మగొనిపోవ ద్రిమ్మరుతఱి. ౬౨

కం. నిను వెతలఁ గుడుపఁదిరిగెడు
దుసె దారుల మంటిలోనఁ ద్రొక్కుడుఁబరువు
ల్జనకుండను బూనికచే
సి నటుల మనుమ్రింగుచుండెఁ జిన్నతనమునఁ. ౬౩

చ. అదిగనియన్న యైనబలుఁ డర్మిలిఁ దల్లికిఁ దెల్పెఁదమ్ముఁడా
చదరములోన నాఁడుకొను సంగడిపారలు నేను వద్దన
న్గొదువక మంటిపెల్లఁగొని గోరులగీరుచు బెల్లపచ్చుఁబో
లిదియనిమ్రింగెఁగంటివనవెక్కుఁగఁరోసముడాసియిట్లనున్

కం. అన్నా మన్నేటికి నీ
కున్నవి చక్కెరల మూటలొప్పుగఁ దినఁగాఁ
జన్నే యిటు కసుపంటకు
తిన్నన్నల కరుగ కముఱు తెగుళులు తండ్రీ. ౬౬

సీ. వలదన్న నీటిలో వదలక తిరిగెద
వలసటఁబడి యెత్తె దలమిగుండు
లోలి పల్లొత్తులనోపిక మనఁబొందు
దర మానిసివి కంబమూపగలవె
చనువమీరగ జేరి చరితేగ మడుకక
కొంచె మిమ్మనెదవు కొసరి మసరి
తండ్రి సెప్పినమాట తగునని తల్లినెం
చుదు వాడు జగడము లగురగెలుతు

గీ. పలుకఁ గన్నమ్మతోడుల యందుఁజూపు
దడుగవిమ్మని మొలకుబట్టె నఁ దిరుగు
దాచకడతువు కూళలనంటి తుదకు
సిట్టి సీగుట్టెఱుంగ నే నెంతదాన. ౬౭

వ. అని విన్నాణంబునఁ దన్ను గుఱించి యాఁడు కన్నతల్లి సుద్దు లాలకించి యొద్దిక నొద్దఁజేరి యిట్లని బదులు మాటలాడ నుంకించి. ౬౮

సీ. మనుదింటివని కానిమాట లన్నయ్యాడ
ఁని నమ్మితివె తల్లి విడువు సెపుడుఁ
దాఁదప్పు సేసి నాతప్పుగాఁ జెప్పి నాఁ
డాతఁడు మంటితో నాడెఁదొలుతఁ
దార్కాణగావింతుఁ దలవిప్పిచూడుము
మన్ను పుట్టలుగట్టె మాడునందు
నాదెసఁదప్పైన నాఁడుమన్నించకు
మేనోరు దెరచెద నిపుడుసూడు

గీ. మనుచుఁ జూపినఁ దొలియట్ల నందుఁదోచె
నచ్చెరువు నంది యాబిడ యతనిమొదటి
వేల్పు తనకూనయై పుట్టె వేఁడుకొందు
ననుచు మ్రొక్కులు సవరించి యాడువానఁ
దెలిఁగా దేమియు ననుఁ గడ తేర్పుమనియె. ౧౯

గీ. ఇటుల విన్నాణమున మించు నింతికపుడె
మది తిరుగఁబాఱ మైకంబు మాటుపఱిచె
నంత నాయమ్మ కొడుకు ముద్దాడి బిడ్డ
యిరుగు పొరుగుల కేగకు మేలతిరుగ. ౨౦

చ. పడుచులఁ బట్టినాఁడవని పాల్పెరుగు ల్దిగ మ్రింగితంచుఁబ
ల్దుడుకులు పల్కితీవనుచుఁ దూలగఁ జెప్పిరి ప్రేతలెల్ల నా
గడముల నెల్లమాని యిలుగాచుక యుండుము వాడ నిందలం
బడకుము గొప్పయుప్పెనల వాటిలు నబ్బునె దానభాగ్యముల్.

క. అని వినిచి చనియె మనికికిఁ
దనవలసిన యెడకుసాగి తడవాటలతోఁ
జనవలరఁ గూడి ప్రొద్దే
గినతఱి నిలుసీరవరిగెఁ గిల్కొను కడిమిన్. ౭౨

వ. అంత. ౭౩

చ. నెలతలు వాఢలందిరుగ నేఁబడలించితి నంచుఁ గొండెము
ల్పలికిరి తల్లిమ్రోలఁ దొలుబాములఁ దామొనరింప గుంపులా
కొలలఁ దొలంగఁజేయుటకుఁ గూరిమివచ్చుట నెంచరైరి వా
రలసట వేఁడుదాఁకఁ జననంచని వెన్నుఁడు వానెఁ ద్రిప్పటల్

చ. వెనుకటి కట్టులంజెఱచు వేగనులయ్యఁయనుంగుఁదమ్ముఁడా
పెనుపుల చేడెలంగలఁచు బిఱ్ఱునఁ బొమ్మని వాలుకైకెపుం
జనవరి కేపె జవ్వనులు జాలిని డీల్పడి నల్లనయ్య పొం
దనువెటు గాకయున్న పలపాపిరి లోపలఁ దల్లడింపుచున్.

సీ. మరికొంద అఱివలు మలబడ్డనోమినఁ
గోరికలన్నియుఁ గూర్పుననుచుఁ
జందురు రిక్కచేజరుగు పున్నమ గల
నెలతొలి ప్రొద్దునఁనిండునీరు
జోకవారెడు కఱివాఁక సెంగటఁ జేరి
కేవ్రునఁ దమతమ పావడ లిడి
గట్టి సెందంబులఁ గఱివేల్పుఁ బలుమాఱు
నెచ్చరించుచుఁ గ్రుంకి యేటబారి

గీ. యిసుముచే నన్ని మేలుల యింతిఁ జేసి
తలఁపుఁ జెందింప సీతల్లి దగునని పది
యారుసంకెల యూడిగాల్చేరిచేసి
మ్రొక్కి కొల్చిరి మక్కువఁ జిక్కి వారు. ౭౬

గీ. ప్రొద్దుప్రొద్దున నిటుల వ్రేబుడుత లచట
నోము నిండార నెలకడ కోమికమరఁ
జేయు చుండంగ నొకనాఁడు సిరిమగండు
కోరిక లొసంగ డెందంబు కూరిమిదగ. ౭౭

ఉ. పోయి తనున్మదిన్దలచు బోటుల కోరికలిచ్చు పూన్కి తో
దోయము వారిఁగన్మొలపుతో నిలువుండని యానతిచ్చి యా
చాయలసందుగొందులనుజన్నానుమాయఁగ వేడ్కతోడఁదాఁ
బాయక చేరి యెద్దుపయి బంతిగనుంచిన కోకలన్నియున్.

కం. ఒకమాటగట్టి యప్పుడు
పకపకనగి చేడెలార బట్టలమాటం
దుకపొం డిద్చెదనని ని
ల్వకచని యొక పొన్నమీఁద వైచె న్వడిగాన్. ౭౯

కం. అంతట నచ్చో నిల్వక
పంతంబున మ్రానికెగరి పచ్చని కొమ్మల్
క్రింతలఁ గప్పిన యురవుల
నెంతయు వగనుండె వారి యిచ్చందీర్పన్. ౮౦

వ. అప్పాపనిపాటి గనుంగొని యన్నుగములు వెన్నదొంగా
చెంగున వచ్చి మామాసిన పుట్టంబులు జుట్టి పట్టి నెత్తిం

బెట్టితివి జాణవైనను మావలువలీక పోకలం బోయిన
కేకవేయు వచ్చు పల్లెవారెల్ల మల్లడిగొని పట్టినెట్టుకొని
కొట్టితిట్టి మట్టాడుదు రిట్టి రట్టులేల గుట్టుగాఁగట్టుపుట్టంబు
లిట్టిచ్చి యెందేనిజరుగుము. ౮౧

సీ. పుడమి విత్తనములు వోకుండ నిల్పుటో
పెద్దకొండల నెత్తు పెత్తనంబో
నేల క్రిందైపోవ నిలఁ వంగఁ బట్టుటో
మానిసి సింగము వ్రాటఁ గనుటో
తొలుత కొంచెముగాను దుది దొడ్డచేయుటో
పసితెక్కలి నడంపఁ బాటువడుటో
కడలి నెక్కుడు బల్మి కట్టఁ గల్పించుటో
యేరులు వ్రయ్యలై యెసఁగమనుటో

గీ. గొల్లవై రక్కసులమక్కుఁ గూలఁదనుటో
కలికితనమున మార్తుర గండడఁచుటో
కోకలెత్తుక పారుటగొప్ప కొంచె
మెఱుఁగుటేక నెన్నఁడయ్య మిన్నేటి జియ్య. ౮౨

కం. మీతలిదండ్రుల లెఱింగిన
రోత పనుల దిరిగెదనుచు రోయుదురింతే
తాతలు ముత్తాతలు నెను
గీతఁడు మాకొలముఁ జెఱుపనే మనెననరే. ౮౩

చ. వెలదుల యీలువుల్గొనుట వెఱ్ఱిపిలాతఁడు కీడు వారివా
రలు విని యోర్వ రెత్తుదురు ఱంకెలజంకెలఁ బోరుసేయనీ

మలుపుకు సేఁతలంగనిన మన్ననసేయరు తోడిచుట్టము
ల్వేలవెలబోయె దప్పుడిది వేడబమా పడుచాటలొప్పునే.

ఉ॥ కూరిమి నీకువారమయి కూడుటకై సమకూర్పుమమ్ములన్
గోరికఁగాదె యేటిదటఁగూడిన చిక్కనిమంట యెఱ్ఱవా
పారువమెక్కరింత చెలువమ్మగ నర్మిలిఁజేసె డాసి జో
హారుల వేడుకొందుము దొరా కనరాదె యమద్దలంపుటల్.

చం. ఇటు లెటులాడిన న్వలువలేని తలంపు లెఱింగి యింతుల
చ్చట గుమిరైయె నెగుల్వడుచుఁ జన్గవ బంటగునీటి యీఁదువన్
బట పట పండ్లుపెన్నలివు బాటుల నొక్కెడఁజేరి చుట్టురాఁ
దుటుకుయి ముందుకర్జమెటు దోచకయుండిరి వెఱ్ఱిలోయనన్

వ. ఇట్లుండి తమలోన. ౮౨

సీ. ప్రొద్దేగునందాక బోటి యిందేయుండి
చీకటిపడ నిండ్లఁజేరుదమె య
టంచోర్తువల్కిన నడిగాదు దొమ్మిగా
జగడింప బెగడంది నడలు కోక
లని యొక యమ చెప్పెనది మెచ్చ కింకొక
పూబోణి గట్టువా పూన్కనియె
మనమందఱము జాల మాటి మాటికి యువ్వఁ
గ్రొవ్వాఱి యుఱుకు నాగుబ్బెఱింగి

గీ. మనము పుట్టంబులందుక మఱలరాదె
యనుచు పలుమాంట లత్తరి నాడువారి

నాఁడువారిఁ గనుంగొని యలఁతినవ్వు
మొలకలెత్త మొగంబునఁ బలికె శౌరి. ౮౮

సీ. ముగుద వెలఁదులార మోమోటమెడలిన
కతలేల పన్నిద రతకవట్టి
వేఁజెప్పు డిప్పాటి నింపగు మీమదిఁ
బరికింపుఁడు బిడెంబు పాదుకొలుప
నేల యింతకు ముందఱేను నిరాజతనుంటి
నెఱుఁగనివింత మీయెడలనద్ది
నోముపంటల మీకునే మాన కొసఁగుదుఁ
జేతులఁ బైకెత్తి చేరి నాదు

గీ. హజ్జలంటిన వారికి నావటముగఁ
గట్టు పుట్టంబు లిచ్చుటేగాదు వార
లేతలంపున నోచిరో యెఱిఁగి దాని
మాన కొనగూర్చి పుట్టువు మఱలఁజేతు. ౮౯

గీ. ఇవ్విధంబున నల్లయ్య యియ్యకొన్న
మాటఁ దెలబల్కఁ జిల్కలమాటకారు
లొక్కరొక్కరి మొగములు నొకరొకళ్లు
చూచి చిఱునవ్వు లొప్పార సొబగుమీర. ౯౦

చ. నిను మదిఁగోరి కూర్చుటకు నేర్పరిగా మలబిడ్డఁ గొల్చినా
మనుతలఁపబ్బె వచ్చితిట నాసలువండె బిరాన నీవు సె
ప్పినయటులన్నుగించెదము ప్రేముడి నేలుము సామియంచుఁ జేఁ
జను మొనలాని యొక్కచెయిఁ జాపుచు గుట్టగు చోటుచాటుగాఁ

కం. నడచిరి పౌన్రమాకునకుం
దడుగున కొమ్మానియున్న యాల్గాపరి బి
డ్డడు సెలవిచ్చిన తెరవున
బడి బడి నగిశౌరి గొల్లపడుచుల కనియెన్.

వ. మచ్చకంటులారా వచ్చితిరే ముచ్చట పడితి నేన నిచ్చ
కంబు లేని సెలవిచ్చెదఁగాని యిచ్చేరువ చేతులు రెండును
మూతులపై కెత్తి నెత్తిపై హత్తించి జోతలిడినంగాని మేలు
బొసగదని పసంగించిన నాసిబ్బెతలు గొబ్బునం బిడెంబు
లడంచుకొని యట్లనే మ్రొక్కుచు బానిసల యాసల
మోసపుచ్చక యిచ్చుతలంపు గీలింపుమని యొక రొక
రాడుచు నిక్కి నిలిచిన పక్కలెగర నవ్వుచు జవ్వనులారా
పుచ్చుకొనుం డిచ్చితి నని మూట నేల నాటం గాలఁ
దాటించిన. ౬౩

గీ. అంది పుచ్చుకొనిరి యప్పుడే ముదుపాపి
ముడి వదల్చి రొండి ముడికి దాల్చి
సంతసమున నిండ్ల జాడల నేగిరి
వెలదు లొకర కొకరు వెంబడించి. ౬౪

మ. వలపుల్మ్రొందుగఁ బొర్ల జేసి కొలబోవం గట్టులం దెంప జొ
బ్బిలు వేడ్కన్ జనుదెంచి కోకలకుగాఁ బెన్గాసితో వేడు చే
డెల మన్నించి యొసంగి పల్లియకు దండింబోయె క్రేదిమ్మరు
ల్కలనం దన్నెదురింప ముత్తినిడు వేడ్కన్గొల్వ లేకుండునే

గీ. తల్లిమ్రోల నిలిచి దండడి గిన్నతె
బాలుపోయు మనుచు బైటఁ బట్టె
గడుపు నిండఁబోయ గజ్జుగజ్జున ద్రేఁపి
పల్లెఁదిరిగె గొల్ల పిల్లవాఁడు. ౯౬

ఉ. అంతట నాల నేలుదొర యప్పలగా డిలుబట్ట కాటలం
గంతులు వైచి కొంటెడను గత్తర వత్తిడిగా మెలంగుటల్
చెంతలవారు దెల్ప విని చేత చురుక్కనిపించ లేక నె
క్కెంత నెగుల్గలంప విసుకెంతయు మానిన తాల్మికల్మిచేఁ.

ఉ. పాపడ నేటనుండి మన పాడిపసింగల మేఁత దూడల
జ్జోపుచు సంగడీలు నినుజుట్టి సరిం బరతేరనంచు దా
దాఁపుగ దీసి చెప్పి సతదాటుల బెత్తము చద్ది చిక్కము
జ్జేపడు కంచుకొమ్ము తొలి చెక్కడు పిల్లనగ్రోవు లిచ్చినన్.

వ. ఇయ్యకొని నల్లనయ్య. ౯౯

ఉ. ఆవలి రేపటిన్తరపు లన్నిటి రొప్పగ రాముతోడ కె
మ్మోవిని పిల్లగ్రోవి దగ మోపి సుమాళముగాగ బాడుచు
న్నావుల నీడల న్బవలు మండెడు ప్రొద్దువెలుంగు వేడుము
ల్లోవగ నుండుచున్బలము పొంతల దూడల గాసె దిట్టయై

క. దొంగన్యై వ్రేపిల గాడుల
నెరతనములు దెలసి గొప్ప నెరపుచు వార
ల్వెరికికొని వచ్చి నెమ్ముల
పురులిచ్చిన నందికొనుచుఁ బొసఁగి పొలమునన్. ౧౦౧

వ. ఇట్లుండ. ౧౦౨

సీ. ఒకనాఁడు కంసుని యొప్పిదంబును గొని
మంద చేరువఱొక్క మూసిదిండి
చనుదెంచె వాఁడొక సరిద్రొక్కు గెట్టెలు
మలుగు మేత్తనము డాల్గులుకు మేను
చిఱుత యూబరము మల్పినకీతి తొలిపండ్లు
నల మానికంబు లనంగదగిన
మెఱుఁగు కాటుకకండ్లు మిసమిస పసదూఁగు
ముట్టె యల్లలనాఁడు ముద్దుగంగ
గీ. డోలు గలిగిన దూడయై సోలి వ్రాలి
యఱ్ఱు పైకెత్తి నిల్చుచు నాడనాడ
గడ్డి పరకలు నములుచు గదిసి వ్రేల
చిఱుతలం దన్నదమ్ములఁ గరము వెడకె. ౧౦౩

వ. ఇట్లా చెడుగురాకాసి మిన్నతఱిఁ గని మున్నిగొను పూనికఁ
గ్రేపుల దాపులం దోపిక దిరుగుట లరసి కరివేల్పు నల్ల
వలె దాల్పున కాకల్లజెల్పి మెల్లన గనుచుండు మని యాన
తిచ్చి చూని పోకవెంటనె జంటగా నంటి తిరిగి పెంటి
తరపు వంటి కెగరు నెపంబున నప్పాలసుదిండి వెనుకటి కా
ళ్లత నఱచేతం బట్టుతఱి నాదూడ గెట్టెల మొట్టున మిట్టిపడి
యాదిట్ట పొట్టకావరం బామట్టుదుగాక నెట్టుకొని
యిట్టట్టు బోవనిత్తునే జత్తువుగాక యని యత్తఱి గత్తులం
బోని బెరడులం జొత్తిల్లు వెలగ సాలగకుండ మొత్తిక్రేడు
కాలిదుగచే గిలించి నేలవిసరి కొట్టిన. ౧౦౪

శా. వాతన్మూర్ఛన నెత్తురుల్దొరుగ గోవాడాడనే కూలియు
బ్భ్రాతల్మిక్కుటమైన మేనినడుమం దొప్పారు నిండూపి రెం
తోఁ దారన్గనుపించె రక్కసి యొడల్ద్రోపాడి వ్రేపల్లె పె
న్గోతిన్జేరి బిరగ్గి జూచిరట మొగ్గున్గ్గుచు వ్రీలగాఁ. ౧౦౫

మ. బిరుదా రక్కసివచ్చి కూలవెఱగుం బిత్త్రేగు డెందంబుల
న్జిరుతల్దామును పల్లెజేరి వడకు న్జేడ్పాటుతో నిండ్లలో
బరువు ల్సేయుచునున్న పిన్నలకు రోబ్బాగైన కాపక్కర
ల్వారుసం జిక్కని రాగిరేకులపయిం వ్రాయించి చేఁ గట్టుచున్

వ. ఆరేయి గడపి మఱునాడరమేదివాని పొడుపున లేచి నందు
నితోఁ గంకులఁ గాపాడుటకేల వేలుపులం గొలుతుమే యని
యాయెడ నొడబాటుమీఁద నట్లుసేసి సంతసించి రవ్వల.

సీ. జతగాండ్రు ప్రొద్దెక్కె జాగుసేయకు మని
బడిబడి వేగిరపాటు దెల్ప
దూడల వెనువెంట దొడుకులు పర్వెత్తు
పొందు ముంగల నని బోయ లఱువ
చల్దిచిక్కము చేతిసరి గోల వడినిచ్చి
నీడమ్రాకుల నెండ నిల్వఁ డనఁగ
పచ్చి కలంపులఁ బడి క్రేపులేగ సం
దడి మఱువకుఁ డని తాత దెలుప

గీ. పిల్లగ్రోవియు బెత్తంబు పెరుగు చద్ది
వంటకమ్మార్లు గాయదొప్పలను మివుల

జంకలఁ దవిల్చి బువనము ల్సాకెడి దొర
దూడగాపరియై యన్నతోడ వెడలె. ౧౦౯

మ. అడవింజేరి చెలుల్దనుం దిరిగి రానాడాడ సయ్యాటల
స్వేదములొమ్ముకుల పొంతజేయు చిటులే వీదూడలం గూడి రం
జెడమైపోయినఁ గాన లేమనుచుఁ దోనేతెంచు చుట్టాలపి
ల్లదులందూడ్పుచు జేరెఁగృష్ణుఁడొకపూలంగ్రాలుమావిన్వడిన్.

వ. చేరి వారితో నిట్లనియె.

మ. చెలులారా మనమీడ చల్దిగుడువ న్జిక్కంబులన్ డించి దూ
డల గుంపిక్కడ గూడదోలుదమె యొండన్దగ్గి నారన్న వా
రలు నల్లానని పల్లమందు నిలుపన్ రాగ్రేపులం దార్చి య
వ్వలఁ జూడ న్బనుగొంగ యొక్కటెదురై వచ్చెన్గనుల్మండఁగన్

గీ. దానిఁగాంచి జళుకు దవిలి పిల్లలగుంపు
శౌరి మరుగుఁజేరి చాయఁజూపి
నోరుతాక చెప్ప తారుమారై బిగు
వెలమి తావుగొల్పి యిట్టులనిరి. ౧౧౨

కం. పెనుదయ్య మిదియె క్రింగ
న్జను దెంచెడిఁ గావుమనెడి సంగడి పడుచు
ల్దనుజూచి పలుక వెన్నుఁడు
గనుఁగొనెఁ దన కెదుర నడచు గద్దరి కొంగన్. ౧౧౩

వ. అదియును. ౧౧౪

ఉ. ఎక్కడి కంసుఁడంప మొదటింగల నాదుల నెల్లరోసి యీ
చక్కని గొల్లఁడెక్కుడయి చంపిన రక్కసిమూఁక ముచ్చట
ల్గ్రిక్కన వీనుల న్వడినఁ గాంచితి నీతఁడె తేని కంటు చా
నొక్కఁడు ముక్కుచేసనుచు నోరుసడల్చెదుకొంగముందుదాఁ

ఉ. డాసి యిటాడె శౌరి బకుఁడామెను పైకెగబట్టి ముక్కునం
రోసముమీర ద్రుంతునని జొమ్మునబల్మిఁ గలంప వచ్చె దో
హాహో సరిపోయె నీ బ్రతుకు నొక్కట జెందుదు మీరివచ్చినం
బాసిన తావుదప్ప జరుపంగల వావుల గామమింతతోఁ.

గీ. అనుచు మాటలాడునట్టి యెడాట మం
దరిది కొంగమైన యట్టినల్ల
నాను మన్నెపిల్లఁడడ్డమే నాకని
మ్రింగనోరు దెఱచి నింగికెదుర. ౧౧౭

సీ. పైకెత్తి తెఱచిన బలుముక్కు నిరుచేత
బట్టి పైదబ్బ వెన్మట్టజీల్చె
బిరుసు రెండవదబ్బ పిరుదంట దిగువకు
జీల్చిన పెళపెళ జీలిపడియె
నారక్కసుఁడు నిజమైన రూపునఁగూలఁ
బొలమెల్ల నెత్తురు బొరలిపాఱె
నదిగని జతపిల్లలందఱు వెఱగంది
వెన్నుని బొగడుచు వేగసరిగి

గీ. మందపట్టున గొల్లల కందఱికును
క్రందుగాఁ దెల్పి నవ్వుటా లొప్పిందుపఱిచి

విని పసులగాపరు లికేమి వినుదు మొక్క-
తోడు పడుసాగె నుప్పలుల్ తూకితూకి. ౧౧౮

కం. అని కడు దిగులుపడుచు మా
మనికింగల వేల్పుఁబ్రోవు మమ్మని చేతు
ల్జోనిపి తిగకంటి వేలుపుఁ
దనియించిరి వేగడవల తానంబులచేఁ. ౧౧౯

వ. అంత వారలు. ౧౨౦

ఉ. ప్రొద్దోక యేసుగా జరుపఁ బోయె నెలల్మఱిగొన్న యంతలో
ముద్దియ లెల్ల నిండ్లకడ మున్ను తమిన్సరితేని మచ్చిక
న్నుద్దుల నుగ్గడింపుచును జూపులు మాపటి లయ్యెడీ పవ
ల్ముద్దులు గొండరాలకడ మోవగి నెచ్చెలి గాంచ్ర జేసెడిఁ.

వ. అనుచుం దమలోఁ దాము బ్రేతలందఱుం గూడుకొని

మ. చెలియా కృష్ణుఁడునిన్న రేయినను దా చెంగాలఁదాబోవుచుం
దెలియం జాలక సైగయాట పడుచా తిట్టుంబడం గోరితే
పలువా పొమ్మనఁబోయె వెంటఁజనినఁ బైవచ్చి నాకోరిక
ల్కొలగా గూర్చిన సంతసింతపుడు నాకుం దోచదామొం గదే.

ఉ. ఏటికి దెల్లవాఱ పగలేటికి బమ్మ పొసంగజేసెఁ గొం
డాటము లింటమానునని డాయఁగఁజీరెద దూడకాపు దో
డ్పాటు బలుండు గాఁజనఁగఁ బంపెఁగదే చెలి నందుఁడిట్లు చే
డ్పాటులు తోడుతోఁగలిగె వందురుపూవిలుకాఁడొనర్చెడిఁ.

మ. మగువా ముద్దిడరాద యంచు నెదురై మాటాడనా వైపుగా
కగుబో రాతిరి నాయదే నిజముగా నాసాసలం బ్రొద్దు గూ

కగ రా నాతని కడ్డమైనిలువ నాకన్నుంగవ న్గప్పె మా
పగు పెంజీకటి మేరజెప్పనని డాయంబోక బేలైతిగా

గీ. నాతి వెన్నుని మదిగోరు నాటనుండి
సిగ్గుచటికేగెనో నాదు చెట్టబట్టి
యింటికేతేర జెప్పుదు నిపుడు బోయి
పచ్చవలెదాల్పు దేమన్న బ్రతుకననుచు. ౧౨౫

చ. వలపెటులాగుఁ జెప్పఁగదె వాఁడిటురాఁడు పరుండ కంటికి
న్దొలకదు నిద్దురెవ్వరిని దోడ్కొని రా బతిమాలి పంపినన్
బిలుపునకేగి తామె తెరపింగని పొందిన మత్తేను బొంకు
సుద్దులు దగఁజెప్పిపోయెదరు దూరులకోర్పితి నేనెపోయెదన్

చ. చిలుకల కూఁతల న్జెవులు చిల్లులు వోదొడఁగె న్మరుండు క
న్నుల గలయించు విల్గొని చనుంగవ దూర లకోర్కి గుచ్చుటన్
బలపల డెందమున్వగిలె బాగెటులో సెలవియ్య వమ్మ నె
చ్చెలి యిలు చిచ్చువెట్టి వడిజేరెద నల్లనిసామిఁ జెంతకున్.

మ. ననునమ్మ న్మగనాలు లోదమిని మెన్నం డైనఁదావచ్చునో
యని యిక్కఁగుయి వెట్టుచుంటి నిటులాహా రాఁడు పైపైని బో
యిన వారిం దనియించు గాననువిదా యందాక వేగింతు వేఁ
జని పొత్తుం దెదనింటివారడుగుచో చానా వినంజెప్పవే.

సీ. రాలుగరంగునే జాలి మాటాడిన
బతిమాల రాఁడేటి పాపఁడమ్మ
వలపూనకున్న నాడిఁలు చుట్టు దిరుగువాఁ
డమ్మనమ్మగ వేఁడ నోరియడేమె

కట్టుపుట్టం బంటుగా నాసఁగొనువాఁడు
వలువ పైదీసినఁ గలియఁడేమొ
కనుసన్న లెచ్చోటఁ గదిసినఁ జెయువాఁ
డెటు చన్న నటుజేర నేమి యనఁడె

గీ. పలుకకుండంగఁ దప్పేమొ బాసదప్పి
నడువ నేమన్న కంటుగా నుడువ పడఁతి
కాఁపురంబులు సడలించి గాలుపుచ్చి
వలపు కడలి మునింగింప వలచెనేమొ. ౧౩౦

మ. అనియారాజవ్వనులించువిల్లలుగువాఁడాయమ్ములందమ్ములం
జొనుపం దాళగలేక నొక్కరొకరిం జోకార్చుచుం దమ్మిజెం
దిన కాకారదు వల్పువేఁకి యుడికెం దేఁబోక రమ్మంచు నా
డిన మాటల్పెవిదార్పి వారలను గూడెన్ జాణఁడారేలఁదాన్.

గీ. ఇటుల వలపునెరపు నింతులఁ దనియించి
కడకు తనదు టెంకిఁ గనుటఁ దెల్పె
నెట్టులైనఁ దలఁపు నెప్పుడు నిలిపిన
వారఁ లతని యిరవుఁ జేరు టరుదె. ౧౩౨

వ. ఇట్లా మొదలింటివేల్పు మాలిమింజిక్కి మగువలు రేబగళ్లఁ
దాకు తప్పాలెఱుంగక పొదలు తమకంబున నుండ. ౧౩౩

కం. వింతగఁ గనుపించె దెసల్
వంతల బడు టరసి వాగువంతలు బొలము
ల్సంతసిల వానకంనువ
దొంతరలై కొంగ గములు దూకొనె గాబుల్. ౧౩౪

గీ. తలఁపుపేరి కోలన చాగుదమీ నాల్గు
నెలలటంచు నేగె నెమ్మి హావు
మన్న మున్ను కొంచ మలకమర్చిన తూటు
నంచ పిందుతెవులు లంటు టుడిగె. ౧౩౫

శా. కప్పల్బందులు దున్న లేనుఁగులు మూకల్గట్టి నీరానేఁదో
ల్తిప్పల్ముప్పలు వీఁగి పెద్దయెలుగుం దిప్పెప్పఁగాఁజేయుచు
న్చప్పుళ్జొప్పడు గొంతులేక తిరిగె న్పేనల్లగోతు ల్బరు
ల్పిప్పంబారఁగ వేచినట్టి వపసల్పిక్కాఁడె నాఁడుబ్బుతోఁ.

సీ. నసిపోలంబుల నెల్లజావెక్కి కనుపట్టె
మెఱుపులుడాకడ మెఱువఁబట్టెఁ
బల్లలంబులను వానపాములు మెలిబెట్టెఁ
నెట్టని పురుపు లెల్లెడలఁ బుట్టె
'నేనుంగు లందుగుమాని కొమ్మల మట్టె
మబ్బులు చెదలంట మసలిచుట్టె
జుట్టుపిట్టలు నట్టు పట్టులఁబురి వెట్టె
నుఱుము లంచలగమిఁ దఱిమికొట్టె

గీ. నీటివరదలు మెట్టల నేటిపట్టు
లొక్క చదరంబుగాఁ దోవ లొాదుగదొాట్టె
వానసరిసాటి జగమున వాడనేది
కాన లెల్లను గపవబ్బి కానఁబడుటం. ౧౩౭

కం. ఎద్దుల కూబరములు నలు
పద్దించినరీతిఁ గప్పలలవడెఁ బాదుగు

లిద్దిన పెద్దటికలవలె
పొద్దే పాల్గారుచుండెఁ బాలపావులకున్. ౧౩౮

కం. ఏరులు సందీకెప్పుడు
బారుటఁ గసవాప్పినట్టి పట్టులఁ బచ్చ
ల్బారె జిగిసంట వెలఁదుక
పేరురమున వ్రాలు పచ్చపేరులొ యనఁగన్. ౧౩౯

వ. ఇట్లొప్పు వానకందువందంబైన లేతగడ్డి మేసి బలుపందిన గిడ్డుల దొడ్డులం జేరిన జిడ్డుదేర బురదల నిదురింప వని చదరంబులగు వల్లెపరగటి మెట్టల నిలువందోలి కాపాడుచుండఁ గండక్రొవ్వు నివ్వటిలు మానిసిబువ్వ యెకిమీఁడొక్కరుండు కంసుని పంపున పిల్లల నెల్లయెడల దుల్లంజేసి వచ్చెదనని మచ్చరంబున గచ్చులాడిన వాఁడగుట నెల్లకడలం దిరిగితిరిగి పిల్లల దుల్లంజేయుచుం జనుదెంచి యీపొల్లెదాపు వారగు కోపుగల మానిసి మేపులొక పాపనితో నోపలేక మడియుఁటలు విని దిటమరితనంబునం జేరి. ౧౪౦

సీ. నేలఁగాల్తాటించి నింగికి బర్విన
దువ్వాచీకటి గుంపు తోడుసూపఁ
గొమ్ముల దిబ్బలు గోరాడు విసరున
సెగరుగడ్డల గాము లెల్లఁదూల
ముట్టెత్రోపునఁ బల్లె మొనయు సావడిగోడ
అడుగులు బెకలి సందడిగ నురులఁ

బారలెగ దొట్టిన మిరుమిట్లు గొను కనుఁ
గొనల నిప్పులవాన గురియుచుండ

గీ. దోక త్రిప్పులఁ బుట్టిన దుడుకుగాలి
చేరువల నేలపుట్టుల వేరులవియ
గబ్బి ఱంకెల సవ్వడి గాబులెగిరి
చెదరి వాపోవఁ దెఱవలు చిడిముడిపడ. ౧౪౧

గీ. మంద గొందల నుందించు మట్టెగిత్త
పరువు లెత్తుటఁ గన్గొని బ్రతుకుఁగాన
కంగలార్చుచుఁ బల్లెవా రాపలేక
బెదరి నల్గడఁ బరచిరి బీతువొడమి. ౧౪౨

క. ఆయడరునఁ దనునమ్మిన
బోయల కగచాట్లుదెచ్చెఁ బో పాడెద్దీ
రాయిడి మానన్దీని
న్మాయించెద ననుచు లేచె మగఁటిమి హలిదాఁ. ౧౪౩

గీ. ఎదురనిలచి తాటోటుతో నింతబలిమిఁ
బోరెదవొ రారయని పిల్వ మొఱకుమడియ
బింకమున మీఁదికఱ్ఱి పేరెమెత్త
గిత్తరాకాసి నుదుటఁ గాలెత్తిమొత్తె. ౧౪౪

శా. ఆకాల్తాఁకున మాడుపట్టదర వాఁడల్లాడుచు న్వెన్క నే
మీకాళ్ళాకసమంటఁబో నెగరి చిమ్మెన్నెమ్మ దమ్మింపఁగాఁ
జీకాకై మునుద్రెళ్ళెఁ దెల్వి వొడమం జిఱ్ఱాడుచున్నేఁద రా
నీకుంజావొనఁగూడెనింకెచటఁ బోనేర్తుంచుఁగుప్పించితాఁ

ఉ. కొమ్ములు రెండును న్మొలచి గూడల పట్టగు వంగఁ ద్రిప్పి సం
గ్రుమ్మరి వెన్ప గుల్కొనుచు గొబ్బున నెత్తురు దాఁ సోలె తే
లెమ్మని వెన్నుఁ డుద్దవిడి లెప్పునఁ బైఁబడి తన్ని యీడ్వ ని
క్కమ్మగు మేన గిబ్బ పొడగన్పడ కప్పుడె చచ్చెవాఁడొగిన్.

ఉ. పల్లియ వారువచ్చిరని పాపసిచే బడిపోయె వీడు మ
మ్మెల్లఁ గలంప వచ్చియని యేర్పడఁ బల్కుచు గొప్పగుటలో
మెల్లనడించి పైనిడిరి మిక్కుటమై తగుచాపురాళ్లు మే
నెల్లెడఁ గానరాక చటనే చివుకం గసిత్రూగు బాటుగన్.

గీ. వాఁడు మడియుటయును వడిగల తనయన్న
కొంగ దాల్పుముందె గూలుటయును
విని యఘాసురుండు విరివి పామిది యనఁ
బండియుండె దూడ పదుపుత్రోవ. ౧౪౮

వ. అట్టియెడ. ౧౪౯

ఉ. పిచ్చుక కుంటిపెన్మొడవు పేరిమి గుబ్బలమీఁద హత్తిరాఁ
గుచ్చెల లంటదోపి తమకుం గల పాడిపెరుంగు జవ్వాడు
ద్రిచ్చుచునుండ నల్లఁడెడదం దలపోసె బిరాన దూడలం
బచ్చికమేపఁ దానరిగి పాముగు రక్కసుఁ గూల్తునంచొగిన్.

చ. అది దన డెందమం దిముడ నాతఁడు సంగడి వారిబోరి లే
గదుపులఁ బెందలాడి గొని కావఁగ నేగుద మన్నవారుమం
చిదియని పైనమై వెడలఁ జేకరపిల్లనగ్రోవి కల్పుచే
మెదపిన చద్దికొమ్ముగొని మెల్లన దూడల దోలెఁ గానలన్

మ. తలపై నెమ్మి పురింబిగించి మొలచెంతం బట్టు చెంగావిజ
ల్లుల వల్లెంబిగజుట్టి కారడవి పూలున్ లేజిగుళ్లుంచి మొ
ల్లలతోఁ జేసిన దండలఱ్ఱుబడి వ్రేలన్ వేల చిన్నప్పలా
గులుకుల్పెయ్యాలు మెచ్చిరాఁదిరిగెముం గోలైయనుం గంటిరాన్

సీ. ఒక చిన్నపాపఁడు నొక చెట్టుఁ బట్టిరా
నీటుగా గొంతసే పాటలాడి
పడుచు గొల్లల మెడబట్టి యొక్కింతసే
పుయ్యాలపై నట్టు లూగులాడి
చెంగట బంతులం జేనాడు పిల్లల
పెన్నుద్ది నని సరి పెనుగులాడి
యొకఁడు పిల్లనగ్రోవి నూదినఁ దానేగి
తానకంబుల మెట్టు లాగిసోలి

గీ. కొంద ఱెదురైనఁ బైకెత్తి కూలఁద్రోచి
పడిన నొచ్చెనె యని మేను బట్టిపిసిక
యడవిలోఁ బొద్దుపోకకై యచ్చటచట
ససముగాని పనుల్సేయు టగుఁదొనర్చె. ౧౪౧

సీ. ముందఱ నిలిచిన న్మ్రుట్టకుండిన మీఁకు
ముట్టినఁ బరువెత్తి మ్రొగ్గువాడు
తలపాగఁ గొని చెట్టుతలమీఁద వైచిన
దెచ్చుకోలేక పైవచ్చువారు
చల్దిచిక్కము మ్రోవఁ జాలవు తెమ్మని
శలవంటకము దిని సొలయువారు.

సెలగోల యంది మ్మవలబోద మఱవంగ
నడుమెక్కి పడఁద్రోయ నలుగువారు

గీ. కోడిగంబులు వల్కుచుఁ గోకమొలది
పడ్డఁ బరువెత్తి దిసులయి పదరువారు
నగుచు నాల్గాపు బిడ్డలు నలమటింప
నిండ్ల కడఁజెప్ప వద్దఁ యెలమి వేడు. ౧౬౫

వ. ఇట్లా పులుఁగు బాబాసామి మొదవుల నేలువారి బిడ్డలతోఁ గొంత సేపు సయ్యాటల విరాళించి వారలుం దాను మఱియును, ౧౬౬

శా. పూఁగాయల్పడ రాల్పుచుం బులుగులం బోనీక బిట్టాపుచు
న్నీగల్జుట్టిన పెన్పొదల్నిలిచి వెల్లిన్దోపగాఁ దెంచుచున్
వాగుల్వంతలు పూష్పుచున్మలపి సివ్వంగుల్పులుల్దుప్పులు
న్డాగన్జోటెడమీఁక మూఁకలయి కానల్కొనలత్రాడుచున్.

గీ. కుఱ్ఱలును దాను నిటులాడుకొనుచునుండ
రెంపు జాలయ్యె నది సిరితేఁ డెఱింగి
తోడివారలతోనను దూలెఁ బ్రొద్దు
చల్ది మెక్కుదమే చెట్లచాటు కరిగి. ౧౬౭

వ. మఱియును,

సీ. మేలైన చివరల మేలందికగుదాని
నాకులఁ దపసుల నాఁగుదాని
నలువంక గొమ్మలఁ జెలువమియ్యెడుదాని
నూడల పాపరా నొరయుదానిఁ

బలువన్నె పులుగుల బందిసందడిగాని
వేవెలుంగులు జొరవెఱచుదాని
బండిగుర్వ్రాంద పెన్పందిరల్దగుదాని
గొప్ప పాముల తొఱ్ఱలొప్పుదాని

గీ. గాంచితిర పిల్లలార మీకన్నులలర
మఱ్ఱిమ్రానిది యీనీడ మనము జేరి
పగటి బువ్వాలు మెక్కి యీపైన వలచు
త్రోవఁ జనుదము దూడలఁ దోలుకొనుచు. ౧౫౯

వ. అనుటయు

శా. ఆమాటల్విని దూడకాపరులు తెంపైపోయె దూడల్గటా
జామీడం గలవంటకంబు దిననేచాయన్వెస బోవునో
మామా లేగలఁగొంచువచ్చి కుడువన్మంచయ్యెడింగాదె నా
మీమాటల్గొరగావు దూడలను నెమ్మిన్దెత్తు బోసేయుఁడా

గీ. అనుచు మఱ్ఱికొమ్మనటువంచి చివ్వన
నెగిరి దానిమీఁద సమిడిచూచి
తఱపు లవియె యేటిదండ కయ్యాలలోన
మేయుచున్నవసిన మేలె యనుచు. ౧౬౨

కం॥ చిక్కములు విడిచి గొంగడి
కొక్కెరలు సడల్చి చెట్టుకొమ్మలఁ బీట
ల్నెక్కలుపుకొనుచు సందడిఁ
జక్కఁ తలఁ దాచుపాము చెదు రొదసేసెన్. ౧౬౩

గీ. ఆలకాపరిబొట్టె లట్లాలకించి
యేమి యుప్పలిగలిగెనో యెట్టులొకొ
యనుచుఁ బరికింపఁ గనుపించె నప్పుడు పెద్ద
కానరాని కాళ్ళది దిగుల్గ్రమ్ముకొనఁగ. ౧౩౪

వ. అప్పు డప్పిల్లగుం పల్లన నల్లనయ్యతోడ. ౧౩౫

కం. పెంజరమొక్కటి మనలం
గొంజక దిగ్రమింగ వెడలె గోడేర్పడ లా
వుం జేవగల్గు దీనిం
గెంజాయం గంటుఁగూర్చి గెడపుముసామీ. ౧౩౬

మ. బుస నేదాళముగావిమర్చుసెకలంబూ నారిపోనయ్యెడు
న్వసగాదేఁకి దీనినాప ననుచుఁ వ్రాత్రుచ్చినవ్వచ్చి న
ద్దెసలంజూచి పరున్నపెద్దచిలువం దేవుళ్ళపెన్బ్రావువె
క్కసమొప్పం గని పిల్లలార వినుఁ డేఁగ్గల్గి న్వగల్పుట్టునే.

కం. అని యూరడించి పజ్జకుఁ
జనువాఁడై ధట్టిజుట్టి సరిబేరములోఁ
బెనుబాముం డగ్గరె న
చ్చెనటి న్బరిమార్చనరిదె సెత్తియతనికిన్. ౧౩౭

సీ. కళుకునలుపురాలఁ గసిదీర్చు కన్గవ
జగజంపుగొడుగుల సరి పడగలుఁ
దలపూనికపువన్న మలయు తిన్నని ముట్టె
కనరాక కడుపంటు గడుసుకాళ్ళుఁ

బలవెండ్రుకలతోన పసమించు నెమ్మేను
కఱకు ఱంపము లైనగాంచు కోర
లలచాలు దెగడు చాపలవడు పెందోక
కడిది జిల్గొప్పారు కత్తళంబుఁ

గీ. గలిగి తనదాపుసేర నొక్కరుని దొలఁగి
యవలఁబోకుండ మ్రింగెడు నట్టినోరు
దెఱచికొనియున్న పెనుబాము ధెవులకుండఁ
గాల మువ్వ్రా రెగసితన్న కళవళించి. ౧౬౮

మ. పిలగా తన్నెదవేల నీకు బ్రతుక న్నెన్నొద్దులే దిప్పుడే
నలుక న్మ్రింగెదనంచుఁ బైకెగరి పిల్లాతండ్రు నొక్కుమ్మడి
న్దొలి గ్రుక్కన్గొని వెన్నుని న్మ్రసవఁగాఁ దోరంపు నోరెత్తినాఁ
ల్కల మేనాకి గబుక్కున న్గుటకదాక న్జొన్పె నాతం డొగిన్.

గీ. తనదుమేను సందు దగులకుండఁగఁ బెంచి
యూరు పాఁగ మిద్దె యో యనంగ
వెలుఁగఁ దల్లడిల్లి విరవిరబారలిన
వదలఁడయ్యెఁ గుడుసువాలు వేల్పు ౧౭౦

కం. గొంతాగినఁ బంతము సెడి
గంతుగొనియెఁ జిల్వ తేఁడు గడకం బిలగాం
డ్రెంతయు వేడుక వెల్వడి
బొంతలు పై కెగరవైచి పొరిఁబొరి నగుచున్. ౧౭౧

వ. వెలిఁజేరి యొకరితో నొకరు. ౧౭౩

ఉ. ముప్పుగ చేసుకొంర లర మోపిన నీల్గుమరెల్ల వారు న
న్నిప్పుడ మిన్నుడల్పురుప నెంతుల నెవ్వరిఁగాన నంచు ముం
దిప్పెను భాము వాతఁబడియె న్నద పొన్నలువయ్యగారిచేఁ
దప్పదుగావు బీరమున దయ్యములన్నొగిలింప బోయినన్.

గీ. వాలికడుపుఁజొచ్చి వ్రచ్చి కండలుద్రెంచి
వరదనెత్తురచట వాగుబాఱఁ
జేసి వచ్చి తోడిచెలులలో నొక్కఁడై
వలికెఁ దేనెలొలుకఁ బక్కిడాలు. ౧౭౫

కం. ఆకటఁబడితిరి యలసట
తేకువసెడ జాగులేల తెచ్చినచద్దు
ల్యాకగఁజుట్టుం బంతిగ
నాకడ మెక్కుఁడని నడుమునం దా విడిసెన్. ౧౭౬

మ. నడుచక్కన్దగు తన్నుఁజుట్టుకొని బోనంబప్పుడే గొప్ప వి
ప్పుడుపూమోదుగుపంటుటాకులపయింబాలొప్పఁగానుంచి వ్రే
పడుచు న్గేరుచు నారగించిరి చవుల్బ్రాటిల్లు పచ్చళ్లు పొం
గుడుబూరెల్వడుగుల్నెయిన్వడయు నాకుంగూరలప్పాలతోన్

సీ. ఒకడు ముచ్చటనుండ నొకడు మేలిమికూర
లందిపుచ్చుక మ్రింగి యవలికేగు
నావపచ్చడి మంచిదౌనా యని యొకండు
మిడుకనెత్తుకపారు మిడిసియొక్కఁ
డూరుదబ్బలు నంజుచుండ నొక్కఁడు సందు
గని యొక్కరుఁడు దిను గారెలెలమి

కడినీగజతికె నేగనితీతుఁ దెమ్మః
యొకరు డొక్కనిముద్ద నొడిసి నమలు

గీ. నిటుల సయ్యాటలాడుచు నీటు మెరయ
బంతు లేరపడఁ జల్దులు వింతవింత
రుచులఁ దెల్పుచుఁ గుడిచెడి రూపు దెలిసి
పల్కె నల్లప్ప డప్పిల్ల బంతితోడ. ౧౭౮

ఉ. దూడలజాడ నేడరసి తోలుకవచ్చెద నింద యుండుఁ డం
చాడి వడి న్గడల్వెదకు నప్పుడు తామరచూలి గొల్లడఁ
న్వేడబమూని పాల్వెరుగు వెన్నలు దొంగిలి మెక్కు క్రొవ్వినా
డీడుకురాని సేఁతలకు నెల్లను దానని వెంబడించుచున్.

చ. తడవటినుంచి పెన్బలిమి దాలుప నామొన కెక్కుపూతన
న్గడపె మొగుళ్ళ త్రోవలను గిట్టు నెగుల్వ చరించు బండి కా
ల్కడకొన వ్రేలదాచెఁ బడఁగా సుడిగాలిగ మాసి నెత్తురా
నుడుఁబయి కెత్తెఁ జంపెఁబడనూఁకె జతందగు మద్దిమ్రాఁకులన్

సీ. దూడయైవచ్చిన తులువ నొక్కటఁ గూల్చెఁ
గొంగయైవచ్చినఁ గూల్చె బకునిఁ
బాముయి పైఁబడ్డ పగతుఁ బొట్టఁ బగిల్చె
బసవఁడై రక్కసిఁ బట్టి మెదిపె
నాలగాపరి జవరాండ్రఁ జిక్కులు వెట్టి
పాల్వెన్నఁ దిని దొంగపనుల నార్చె
వ్రేఁతలపుట్టము ల్వాతబెట్టి కడకిచ్చె
నోరఁ జగంబుల నోలి జూపెఁ

గీ. దల్లి బెదరించి జోలఁ బెన్డ్రొట్టఁగట్టఁ
దాపుఁదరలంగ నీడిచెఁ దలఁగఁడెందు
పితనిబలుపోకలెట్టివో యెఱుగఁవలయు
నని నలువ యాలదూడల నపుడు దాచె. ౧౫౧

వ. అంత కృష్ణుండు.

గీ. వెదకి వెదకి దూడకొదములఁగానక
తిరిగివచ్చి కూడుదిన్నచోట
పిల్లగాండ్రఁజూడ బిరబిరరా వారి
దాదెఁ బాత కొండ దండగవిని. ౧౫౩

క. అక్కడ పిల్లలఁగానక
సొక్కుచుఁ గేకలిడి పిలచి సొరియ లరసి యే
నక్కనగానక పెసిసెన్
బొక్కిలి బిడ్డపనులాట పొంగుదు మదితోన్. ౧౫౪

శా. నన్నామైదునముంపఁజూచె జగముల్నామాయలోఁజిక్కెను
ద్దన్నున్నానెఱుఁగంగ లేకుడుగుట ల్దా జూడ లేదేమొ కా
సన్నంబీపని మాన్పుటెంత దెలియన్నాలందు నాబిడ్డఁడే
మన్నంగాదు నలంగి మోటువడి సేమంబీక తావచ్చెడిన్.

గీ. మొదటి పుడమిగోడవ వదలింపుమని వేడ
నీడబుట్టుమనుట లెల్లమఱిచె
మఱుపు దెలుపనేల మసలినఁ దనుదానె
తెలుపుకొనునటంచు దిటముతోడ. ౧౫౬

క. పల్లెకుఁ జని యాగొల్లలు
తల్లడపడఁ బిల్లగుంపు తడసి కడవిలో
నెల్లి సని వెదకుఁడన వా
రెల్ల దిగుల్పొంద నేల యిపుడె కుమురుతుఁ. ౧౮౨

వ. అని తలపోఁతలఁ బడుచు నచ్చెరుత దచ్చివేసంపు సామి
యప్పసిపాపల ముక్కు చెక్కు డొక్క పక్క లెట్లెట్లు
తొల్లి నట్లట్లచ్చొత్తిన యట్లు గానయ్యె యట్లనె తెలుపుల
రూపులుం దానయగుచు మందల కరుదెంచి యెదురుగా
నాగిన గిడ్డలు తమ బిడ్డల ముందలుము నట్లలమికొనుటఁ
జూచి వ్రేతఁలు నీ తెలుంగున నామఱుంగు నెఱుంగజాలరఁ
డెందంబున సంతసంబంది సాగుడుమూగి ముని వారి
వారిండ్ల కడకేగిన నప్పుడే యెబిడ్డ లేయేపొలఁకువ మెలం
గుదు రామెలఁకువఁ దప్పకుండఁ దిరిగిన నాయవ్వ లెవ్వ
రీబూటకంబు నెఱపుట నేటికొనదాక జఱిగినం గనలేక
తమబిడ్డల శాంతలంచిరి మఱియు నొక్కనాఁడడవి దూడ
లంగాచుచు ౧౮౩

కం. నాగేటివాలుదాలుపు
జాగేటికి తమ్ముగుఱ్ఱ సరిజెల్పుము ము
న్నాఁ గాపరిపిల్లగాడుల
వేఁగనులయ్యా జతలనుచు వేమఱుఁ దలఁతుఁ. ౧౮౪

కం. క్రేపులఁ బాపల తెగలని
రూపింపుదు నిప్పుడెల్లఱు న్నీవని నా

కీపగిదిఁ దోచు నిజ మిం
తే పనిఁ దెల్పుమనఁ దనకుఁ దెలదని నుడివెన్. ౧౯౦

శా. ఆమాట ల్విని సోకినంతటనె యన్నా తెల్పెద న్బచ్చ్మ న
న్నాబు ల్వెట్టఁదలంచి దూడ కడుపుం బాపల్లిందూర క
న్బ్రాబు మెన్వారల దేశమూని యిటు గాఁ బేరేచితీయె డనన్
రాముండొప్పుచు సంతసించెఁ గలకారద్దందమక్కారునన్

వ. దూడలం బిల్లగాండ్లం దాఁ దాచిన వెనుకనడుచురీతి నారసి
యా నలువయుఁ దనలో నిట్లనుకొనియె. ౧౯౨

సీ. తనుదాచు బొట్టెలు తలుపులు గవినుండఁ
జూచి వెన్నునివెంట సొరిది దిరుగుఁ
బిల్లలఁ గ్రేపుల పిల్లుబ్బు గన్గొని
బొమ్మ నేనొక్కఁడఁ బుట్టిరెచట
వీరని పెద్దగా విసివి లోవెలిఁజూడ
నంతటఁ దానయ్యె యనురు టరసి
చిన్నబోయి యెటాడఁ దన్నుఁ దా మఱపొంది
యొక కొంతసేపటికయ్య దెలిసి

గీ. తండ్రి మతకరి సేతకై తలఁపు లోన
మెదల నాతఁడె యీతండు మెలపు లేక
తప్పుఁ జేసితి మన్నించు దారి నేరఁ
గోరి కన్గొందునని వెతఁ గూరిగూరి. ౧౯3

కం అడుగులఁబడి మొఱవెట్టక
కడు మన్నన వడయు తెఱవు గల్గద యొరుల

న్వెడఁగునయి చేరి కర్జము
నిడుపొనరుపఁగలని యతుడు నేగుపు లగునే. ౧౯౮

వ. అని తలపోసి తన తెలివితక్కువకు రోసి, వెలిపిట్ట వాహ
నంబుపై కెగరి వగర్చుచు మబ్బుదారింబడి గొబ్బునం జని
చని ప్రొద్దు బిడ్డ యొడ్డుబడి నిలిచి నివ్వెఱపడి నలువఁ
గనుచుండ. ౧౯౯

మ. గవిలోఁ దాచిన దూడగుంపునిసువుల్గా రొక్కంచు నే తెంచి సం
జవుక్రొమ్మెన్నెదలన్నియుంగడచి యాలాన్లప్పకే తెంచి ని
క్కువమా దూడల నెంతయున్నిమిరి డొంకుల్లేకచన్పాలు మ
క్కువతో నిచ్చెను బిల్లగుంపుఁగని బాగుల్మీరి రాల్గాపరుల్

చ. అది గని బమ్మదేవ రరుదంచుచుఁ జూడఁగ గొల్లవారు పి
ల్లదుటుము దూడగుంపుఁ బదిలంబుగఁ గన్పడ నాల్గుచేతులం
గుదె సుడివాలు సంకులును గొమ్మగు సింగిణి పెద్దకత్తి క్రొ
వ్వెద సిరియందఱందరకు నేర్పడ దయ్యముఁబోలి కందగాన్.

సీ. పడిగని యబ్బురపడునంతలోపల
వారలు మాయమై వాస గురిసి
వెలిసిన కైవడి వినువాడ బయలైన
నాతండ్రి నన్నిట్లు నలఁపద్రుంచె
నిటుసేత తెలివబ్బె నింతయు మంచిగా
దలపోతు నేటికి కలకపడగ
కనికరంబునబిల్చి పని వినుమనుగాక
పడిలేవనని బత్తి పాదుకొల్పె

గీ. వెనుక బుట్టి పెఱిగినట్టి వింతలిచట
పనులు ముందఱ సవరింపఁ బాలుపడెను
కర్జములు లోనిచూపునఁ గాంచి మఱలఁ
గాంచెదవటంచు బృందఁ జక్కఁగఁజేరి. ౧౯౮

సీ. బొడ్డానగట్టిన పొంబంచెఁగలవానిఁ
జెవినిఁ బిల్లనగ్రోవిఁ జేర్చువానిఁ
బిల్లలు దూడలు నెల్లఁదానగువానిఁ
బృందయరణ్యకానఁ బెంపెక్కువానిఁ
గన్నులీకలఁ దలకట్టుఁ బెట్టినవాని
నఱుతఁ బూదండల నమరువాని
యాలగాపరుల నయ్యాటల నాదగువాని
దురుసు రక్కసిగుంపుఁ ద్రుంచువాని

గీ. నవ్వుమొగమువాని నాతులసిగ్గులు
కొల్లలాడువాని గొల్లవాని
బొల్లిమోర పక్కఁబూను మేనగలవాని
దాత గాంచెఁ గన్నుదమ్ము లలర. ౧౯౯

చ. కనుగొని యంచనిల్పి తన కావరమేగుట కంజలంటి మ్రొ
క్కనఁ దనుజూడకున్నఁ దమకింపక వేబదినూరుమారు లో
య్యనవలత్రిప్పుటన్బడుచునాడుచుఁ దొల్లిటిమాటలాకొన్ని టం
దనదగు బత్తిపేర్మి గుఱిదప్పక సాగిలుచుండె మాటికిన్.

కం. తెలియక తప్పొనరించితిఁ
బిలగాడుల దూడకదుపుఁ బెరచోనిడితి

న్బలియుఁడవుగాన నన్నియుఁ
దలపోయఁగ నీవయైతి తరమే పొగడన్. ౨౦౧

కం. జగములు నాచేఁ గలిగిన
వగునని గరువంబు నొంది తెక్కలుటట నా
పొఁగరణఁగ నీవు బిడ్డఁడఁ
బగవాఁడని మనుపుమనిన బరువే కావన్. ౨౦౨

గీ. నేల తనుమోచువారలు గూలఁబడుచు
బరువుమోవంగజాల మన్నలుఁ దెలిసి
నాయెదుటఁ బల్కి మిము వేఁడినాఁడ దానఁ
బుట్టితివి పల్లె గడుసుల పొడవడఁప. ౨౦౩

ఉ. ఈకతలెల్లనున్మదికి నెక్కియు నీవొక పిన్నపాప వ
న్నోపికనుబోయి మోసమును బొందఁగలావను వెఱ్ఱిదోచి నే
నీకడ నెగ్గుజేసి తిదియెంతయుఁ దప్పు మలంచి ప్రోవుమో
సాకుడుతండ్రి వేఱ దలచంగలరే సినుఁబోలు వేలుపుల్.

వ. అని విన్నవించిన న్గుయి వినకట్లుండ మఱియును, ౨౦౫

యగణదండకం.—— సిరింరొమ్మునందుంచి చెన్నొందు సామీ
పరాకా చిరాకేల నయ్యాల నేల్వాఁరిలో నేనొకండంచు
మన్నించరాదా దొరా నాకలేవా మొదల్నీవకా యిచ్చ
గల్పింప నీపింతయుంబూన నీయాన నిన్నంటి వేగంటి పె
న్నత్తిదాఁ గ్రొత్తగ్రొత్తైనటుల్గాజగంబుల్దగంజేయదానిన్న
నంజేయు బల్మానిక న్నీవె నీయంతట న్వేల్గు రూపైయెడ

ల్లగ్గు హాళిందొడింజేరి యాడితుఫీజాడ నిగ్గూహఁగా లేదు
గెంజాయలా పెంజడల్ మించు పెద్దల్గదా కాంతుకెప్పు
ట్టునం గుట్టుగాఁ బొట్టలోఁ జూచి నాబోటి వేసూటితోల్లింటి
చందంబునం దేర్పడంగం గురయ్యా దగుల్మేలు లియ్యంగ
నీవెయ్యా డందియ్యాకోజ్జెసి రాకన్న నాకున్న వేవేర
పేరాసలి వెప్పు డుప్పొంగి సన్మెచ్చి యేచొప్పునం జెప్పె
దోయప్పు డారీతిగాఁ జేయుడందాక నీచాయ సెలోయలోఁ
జేరి నీహజ్జలం జేచ్చి డెందాన కుందూను చిందుంపుమం
జెట్టబోఁగొట్టి నీపట్టినక్క రట్టులో బెట్టకీ పట్టునం బ్రోవనే
పిట్టుగ్రొవ్వారె పోంబట్టు పుట్టంబుదారీ మొదల్పేయ
మున్గబ్బి వైప్రబ్బి పెల్లుబ్బు దొడ్డెబ్బనా గుబ్బుగా నీటిజా
లిమ్మ్రగా దొమ్మ్రసాగించు మొప్పెం బడం ద్రోయవే యుం
చువాడ్డాయఁగానే యవే తొల్లి ముక్కంటి శారొమ్రం బైవై
ప్రేలు నీచానుల న్మెచ్చి కోర్కెచ్చినవ్వారు వేరంబుతో
మూగి జోగుప్పలం దెప్పలం దేలు మున్నీటి పెన్నీటముం
పం జొరంబారి తొల్లింటి జేజేల నీచేతిక త్రింబడం మొత్తి
హాత్రింపవే బీరమెల్లాసలం గాసిలం జేయుగానేల నాతప్పు
పోరొప్పి యీయొప్పిదం బీగరాదే వినుందోరి కుయ్యాడనే
నెంతవాడ న్నుడిన్నుంకుదాల్పా యొడల్పెద్దయై యుండ
నిక్కంపనోక్కాక్కజా వొంద్రుకం జెక్కగోతం దలం
పంగ లెక్కింపఁగారాని బంగారు పొట్టయ్యవై దెబ్బగ్రుడ్డు
ల్బెలంగన్నచో నెన్నగానందులం దొక్క గ్రుడ్డందు నుడ్డా
మొగంబు ల్నిగారింపగా నేడుజానల్గ లాతండు నెట్టొప్పు

దీలాటి వెన్నోగలయ్యన్నినుంగాన నాపైనఁ గ్రేగంటిచూ
పాపి నన్నాక ప్రాపయ్యెఁ దింకెట్టులో దేవరా కావరా
సామినేవిప్పుడే కాదు మున్నెప్పుడు నగ్గజముల్దప్పి పోఁజే
యగా వాటివిం జక్క జేయుంగనేమీరు పుట్టిందటల్గంటి
నాకు న్బవల్దిర వేవ్రత్తనంబు ల్బెడంగాంచుచో మీ
లలో మిన్నవై వేగము న్నీటిపైబొంగుఁగో వాడ సేజాడనో
దెప్పియుండిట్టి పెన్నీట దేలాడుచున్నంత లోంగున్న నా
పొట్టలో నెట్టులో చొచ్చి ప్రాబల్కులన్నీల గాదెచ్చి
పెన్ముచ్చు గుజ్జాంపుచేన్న్రవ్రెండు శిరాఁకుచున్బ్వ
నూరించుట ల్మెరెగా గాంచి కొమ్ముచ్చిపోనెత్తి నుత్తిం
టికింబంపి నాకియ్యవా ప్రాతమాట ల్కనుల్మాతలేనట్టి
జేజేల నోజంబడంగొట్టి రాకాసిమూక ల్జెడంగోరి కవ్వం
బుగా కొండ తేనిండు నీటన్మునుంగంబోనుంగైన వేల్పయ్య
నేకయ్యముల్లజ్జా లేని మందియ్య తాబేలవై వీపువిప్పన్మ
లంజేర్చి సాగింపవే గొప్ప కేద్రిమ్మరిడప్పులన్నీల చాపో
నం గుప్పగాబట్టి కొంపోవ నాగత్తరం గాంచి పెన్పంది
రూపంది నాకోరఁ జేకూరఁగాఁ జేయవే వానికిం చావు
బత్తుండవా మొత్తేను దన్నెత్తి దత్తూరమాడంగ రాదీద్ద
కంబంబులో యేడిరాయంచు జేకొద్ది గ్రుద్ద న్వాడి వ్రబ్ధి
లైనట్టి యామొద్దులో తెర్రవా తీరునంబుట్టి బంగారు
పేరింటి రేద్రిప్పుడున్నప్పుడున్దింపవే వాడిగోళ్ళందలారింపు
లేకెచ్చ్పటన్దాసురాతో బలీందుద్రిండు ముజ్జేయుజన్నంబులో
జేరి బిచ్చంబుగా నేల మూడంజలిమ్మన్న వాడీ జగంబెల్ల

బాగా విరాళించి మీఁగాల్త్రాడంగట్టి వానింట లేకుండఁ
బోఁగొట్టి సొమ్ములంతయు న్వేల్పురాచాతనింజేర్చ వేపొట్టిపై
దిట్టడౌ రాచఁడైనట్టి తోల్బుట్టు వాడ్దేవర నొట్టగా బాలు
రూపొపికంబూని ప్రమందింపవే తెంపుఁలో నాలి గొంపోయి
పోరాడఁదా రాడునల్లాను మన్నిని నల్లింబలెంజంపి యొప్పా
రితో రాముడన్నెర నీవిప్పు డిచ్చోట మొప్పెల్పెదుంగు
ల్మ్రుడుంగ నగ్గడంక న్మెలంగం బడంగిల్గలాతండు తోఁడేర్పడ
న్పుట్టినావయ్య నేగంటి నీవాఁడనుమ్మంటిఁగాపాడనీవంటిఁ
బ్రోవంగ దేవుండవయ్యా! ౨౦౬

కం. అని తను వేడిన నలువం
గనికర మొలయంగఁగాంచి కలుగున్మేలుల్
దనివి నని నాఁడ మొఱచేఁ
బెనుఁపొందు మటంచు శౌరి వే సెలవిచ్చెన్.

ఉ. అందుల కొంతయున్బొగడియుంచపఁబుంబడి తొంటియింటిత్రో
వందగినుండుబోవ గొలవారలు పిల్లలు దూడలంటిరాఁ
బొందగుపల్లెకుంజనిరి బోటులెదుర్కొని సంతసిల్ల నా
మందలవారు వేల్పితఁడు మాకనిసారెకుఁజేరి కొల్వఁగాన్.

కం. ఇటమీఁదట వసుదేవుని
చిటిబిడ్డం డేమిచేసెఁ జెపుము నీవిం
బుటకఁగని నయ్యకొడుకా
దిటముగ వే బుడుతరాచ తెగరాబేర్మిన్ ౨౦౯

కం. జక్కులదొర చెలికాఁడా
కొక్కెకుల్డు కొడుకుపైని గూర్మిగలాఁడా

బొక్కలపేరులవాఁడా
చుక్కల రాచతల నమరు సోకులతేఁడా. ౨౧౧

ఉ. బంగరుకొండవిల్లు చెలువన్బసగుల్కెడు వల్లెత్రాడు పాం
గొంగుల వల్లెదాలుపుల కోరియుసంద్రము తూపుదోనె మే
ల్మింగను పొట్టవేల్పు తొలిమిన్కులమావుఁదోలు రాతుగా
నింగిఁజెలంగు వల్లియల నేర్పుగఁగూర్చిన నిప్పుకన్దొరా

మత్తకోకిల. పిల్లనిచ్చిన వాసిజన్నము బిల్కువార్చిన దేవరా
కల్లలాడని తాపసి న్నుకుకందగిల్చెడి వేలుపా
బల్లిదుండగు గుడ్డిరక్కసు బట్టి చీరినగట్టు వా
బొల్లిమోర పులుంగుటెక్కపు బూరగాడి చెలీతొలీ.

సీ. ఇవపు పెన్మలబిడ్డ యొకిమీని నెవరుచేఁ
దోచినయల్లికఁ దొలకువాఁడ
పాటిబండను పేరఁ బరగు విల్వాడి నొప్పి
పురుషోత్తమాఖ్యఁ బెంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు గూర్చిన
కతలన్ని జతపెట్టఁ గడగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబు గలిగింప సమకట్టి
తిండు రెండవపాళి మిటులముగిసె

గీ. దీనినెవ్వరు పుడమిని దీపులమరఁ
జదివినను బెరవారికి సరవిఁదెలుపఁ
దనకుదానె సిరుల్జేరుఁ దలగుఁకీడు
లట్టి వారికి నల్లయ్యఁ డనువుపరుప. ౨౧౩

కంసవిజయము ౨ పాళము ముగిసెను.

ఓం.

# కంస విజయము.

## మూడవ పాళము.

కం. గబ్బిమెకపు రక్కసిదొర
గబ్బి యొడలితిత్తి వలువగా వ్రేల శివం
బుబ్బుమలపట్టి సగమం
దబ్బినమును కాటి బసుమమంటెడు ఱేఁడా! ౧

వ. మనవి తలఁపునఁ జొనుపుము. ౨

కం. వలువ నెలవునకుఁ జేసిన
వెలపల నేమేమిసేసె వెన్నుఁడు దెలియం
బలుకుము సెవులకుఁ బండువు
గలుగ న్జడదారి యొడయ ఱేఁడు వేడుకగాన్. ౩

గీ. అనుచు శూలుని కొలచె నడిగి మనిన
రాచదొర మండలించ షోరామి దొరల
సీతి నడిగడ్డఁ బుట్టిన సెరవరి కొడు
కెలమిఁ జిఱునవ్వు దొలక నిట్టులను బల్కె. ౪

ఉ. గొల్లలతోడఁ బల్లియను గొబ్బునఁ జేసిన నల్లనయ్యతో
మెల్లన ముచ్చటించెఁ బసిమేపరి పెద్ద కడింది రక్కసు
బ్బల్లిదు లేగుదెంచి నినుఁబట్టగఁ బొంచుచు మించినాఁడవీ
పిల్లలఁగూడి దూడలకుఁ బేరెములెత్తరు మొత్తి చెప్పితిన్. ౫

ఉ. పెద్దలు గిడ్డికాపరులు బీరముతోఁ జనుదెంతు రాలతోఁ
బ్రొద్దటినుంచి వారిజతఁ బొమ్మన నట్లనెయుంచు నాటి కే

యొద్దికబుచ్చి వేగుతరి నొక్కఁడు లేచి సుమాళ మొప్పఁగా
మొద్దులిగుర్వఁ బాడె నయము ల్పులకింపుచుఁ బిల్లగ్రోవిచేన్.

చ. అదివిని తెల్లవారెనని యమ్మలు లేచి పెరుంగుఁ ద్రిచ్చు పె
న్త్రొద కుదురయ్యెఁ బల్లెకడ రొప్పగ వావలఁ బోదుకూడు బె
ట్టుదురె యటంచు వేగపడి డొక్కు సడల్చుచు నార
గించి యా। గదుపుల వెంబడించి చని కన్గొనియె న్నల
జాలు లేరొగిన్. ౭

సీ. తనమేని పస యనఁదగు నీటివడిదానిఁ
దరఁగల నొడ్డంటి పొరలుదానిఁ
జేపల మేపుల తాపుకొంగలదాని
మొసళుల సందడిఁ బొసఁగుదాని
నీటిమానసి జోళ్ళు దాటులాడెడుదానిఁ
బ్రాచిబామిన రాతి పసిమిదానిఁ
గలువపూ వలపు లంగడివోలెఁ గలదానిఁ
జిలువలు దరులంటు మెలఁగుదాని

గీ. మిన్నొరసి చుక్కలను బుగ్గలున్నదానిఁ
గొన్నివాళ్ళకుఁ దన పొందుఁ గోరుదాని
బన్నసరముల చిదురుప ల్బరగుదానిఁ
గనిరె విను మానికపు బిడ్డ కప్పుగడ్డ ౮

ఉ. అందొక యోరఁ బెద్దమడుగాగి పడంతులు దాను గాళియుం
డిం దెనలేనిబీరమున నెంతయుఁ బ్రేలుచు మీఁద బాటినన్

పందురిగూలు పక్కిగుమి వా బుసకొట్టి సెకల్గలంపనా
చందమెఱింగి చేరె నలసామి హుటాహుటిఁ జిల్వ రాగుడిన్.

వ. ఇట్లాతానకంబరసి కత్తెపాము గరువతనంబు నరికించు తలంపుతోఁ ధలంట ముంగురుల యుంగరంబు లెగదోపి చేపిశికి మించిన పిల్లనగ్రోవి నుల్లంబంట బిగించిన పైఁడి యొల్లియలోఁ జెక్కి నిక్కి యొక్క మ్రానెక్కి గ్రక్కున గబుక్కున దుమికి నీటిపోటులు గాటులువడఁ జేయాటలం జిమ్మి ముమ్మరమ్ముగా నీదులాడ వాదులాడఁ బ్రోడవలె గోషు కుడువవచ్చె నిచ్చెడుగు బుడుతఁదుచ్చిపాఱఁ గోఱలం జీడుదునని త్రాఁచులదొర మేను సాచి రా లచ్చి మగం డిచ్ఛకొలదిఁ హెచ్చి పచ్చిపొగరున నెదురుబోవ నాచిలువ తేఁడాచక యేచి పైకెగరబారి తూరితూరి కాటుకాటున కేటి కాలువ బారునట్ల నెత్తురు లురులఁగఱచిన. ౧౦

చ. తొలఁగఁడు కేకవేసి వెఱత్రొక్కట్లపాటును జెందఁ డన్నద
మ్ముల పిలుపుగ్గడింపఁ డటువోపుటమానఁడు చిన్నబోఁడు వె
ల్వెలబడి మోము ద్రిప్పఁ డిదివింతగ స్రుక్కఁడు చేతులొడ్డఁడే
తలపుననోయెఱుంగమని దయ్యములబ్బురపాటుసెందఁగాన్.

చ. తనవడి దూల గాయముల దందడిగాఁ దెగజీగఁ జిల్వరా
వెనుతవులాటమున్వదలి వేదురుపోలికఁ నిల్వఁబల్వనీ
పెనుఁకువదక్కనా నిలుముపీచమడంతునునిల్వుమంచుఁ జే
ననువుగఁబట్టి వేపడగలట్టిటుబొర్లుచు మేనుద్రిప్పఁగాన్.

వ. కృష్ణుండు: ౧౩

గీ. పిసికి పిసికి యొత్తి పిప్పిగాఁబడగల
నలిపి నలిపి మేని మెలికలురులఁ
దిప్పి త్రిప్పి మొగము నొప్పించి డాకాల
మట్టెఁబొట్టలోని కట్టెపోవ. ౧౪

కం. తప్పించుకొనఁగఁజాలక
గుప్పన నెత్తురును గ్రొవ్వుఁ గొలకుల వెంట
న్దెప్పలయి జార విడివడు
చొప్పెరుగకఁ దస్సెబాము సొమ్మలు మునుపక్ ౧౫

వ. అంతటంబోక.

సీ. కాలితాకుడులఁ జెక్కలువోవఁ బడగలు
నట్టువ బిట్టుగా నడపి నడపి
తనుజుట్టుకొన్న తోకను జేత మెలిద్రిప్పి
విసరి చెట్టులమీఁద వ్రేసి వేసి
గబ్బిగోళ్ళలు పాదుగదిలి నెత్తుటదోఁగఁ
జేబలువున గుంజి చెరిచి చెరిచి
తలతలఁగల నాలుకలువట్టి తుంగఁ జీ
ల్చినరీతి రెండుగాఁజీల్చి చీల్చి.

గీ. కనుగొలకులందు గోగులుగాడబొడిచి
తలనరంబుల పట్టూడ్చి కలచి కలచి
పలువగలకస్తి నెరపుట బ్రతుకుమాట
వదలి సొమ్మసిల్లెం బెనుపాముతేఁడు. ౧౬

వ. అట్టితఱి;

చ. పెనిమిటి సోలుపాటువిని బెట్టుగ నేడ్చుచుఁ బాపముద్దరాం
డ్రినఁగులఁ జుట్టలుం బలసి యంచులరా దిగులొప్పఁ జేరి నె
క్కొనుతమి నయ్యయో తెలిసికోక కడంక నెదిర్చియిట్టిపా
టొనరితి వింకనైన ముదుగోటమి వేకుము తెల్వితేటలన్

చ. అని మగసింగ మెంచి మొదటాడి హరింగని కేలుమోడ్చి మా
మనవులు సొమ్ము డెందమున మామగఁడీల్గిన దిక్కు లేక యే
యనువునఁ బ్రొద్దుపుచ్చఁ బడునయ్య మొఱల్విని కాచి వీనిఁజ
క్కని కడగంటఁ జూడుమని కస్తిగడల్కొన మ్రొక్కి రొక్కలై

గీ. మొదటిపెండ్లి నేడు తుదముట్టె మరలంగ
మగనిఁ గలిపి పెండ్లి తగనొనర్చు
మంతదాక యడుగులంటి లేవమటంచు
సారె సారె వదరి వాగి మ్రొక్కె. ౨౧

వ. పాపపూఁబోఁడులు మఱల మొఱలు దొరల నిట్లని పొగ
డిరి,

త్రి. పెనునీటి వెల్లువఁ బిరికితనము లేక
ప్రాఁజదువుల దొంగఁ బట్టితీవె
తరిగొండ కడలి నెత్తగిలఁ బెన్నాఁ బేటి
మేటి రూ పొనరిన పోటరీవె
పైడికన్నా కాసిబట్టి చెండుటకుఁగా
నొంటిగాఁ దైనట్టి దంటవీవె
నమ్మినబత్తుని నడత చెల్లించుట
తగసని సింగమై తనరితీవె

గీ. మూడు కాల్ద్రొక్కుడులఁగోరి ముజ్జగముల
నాచికొని వేల్పు వెఱ్ఱక్రిందఁద్రోచితీవె
గండ్రగొడ్డంట రాచవంగడము లడఁచి
పుడమి బాపలకిచ్చిన ప్రోడవీవె. ౨౩

గీ. ప్రొద్దు కాలమునఁబుట్టి పెక్కుపొలసుదిండి
నాలికై కూలఁ జేసిన యలఁతి వీవె
యిపుడు మడియల సమయింప పచ్చఁ బుట్టి
తొలఁగు వెన్నుఁడ వీవగ తలఁతు మయ్య! ౨౪

కం. ముందుతిగవీళ్ళ ద్రిమ్మరి
పందల రక్కసులఁగూల్పఁ బొల్పడెదవు మే
లుందఁగ ముడిచెవి రౌతుల
నందఱఁ గూల్పంగఁ గలికి వౌదువు తెలిసెన్.  ౨౫

ఉ. ఈచెడువాని సేఁత మది నొంచక వేఁడెను మమ్ము మన్పఁగా
నీచెవి దార్చి మాకుయుల నిల్పుము రాయిడి కోర్వలేఁడిఁకన్
గాచిన నీవె గాకొరులు గన్పడ రేదెసఁ దండ్రి మానవే
యేచుటలంచు సాగిలిరి యెంతయుగొంతులువీఁల నేడ్చుచున్

ఉ. ఆమొఱలాలకించి సిరి యన్నువదైతుఁడు రొమ్ముద్రిమ్మరిం
బోమని తాఁదొలంగుటయుఁబోక యెదుర్పడి మొక్కి యింకఁజా
ల్నేమము సంతరింతు జముసం దొలఁగించిన నిన్నె కొల్తు నా
పాముకొలంబు వన్నెఁగనెఁ బాయక డెందముఁగీమునీకగున్

సీ. పుక్కిట విసమొల్కు పుట్టువుఁగలవాఁడఁ
గనవిన వినఁగనఁ గానివాఁడ

వంకర నడతల వాసికెక్కినవాఁడఁ
బుట్ట లెక్కుడు పనిఁ బూనఁగువాఁడ
నడుగు బట్టుకులు మొబడి రాఁ దిరుగువాఁడ
నిదుర. మంపే వెంట నెగడువాఁడఁ
గాల్సేతులొందని గజ్జి యొడలివాఁడఁ
దలల రారాపిడిఁ గలుగువాఁడఁ

గీ. జెమగు పుట్టుక యనెడు పేరొందసినాఁడ
నిట్టి నన్నుఁబట్టి నలుపుట యెక్కువయ్య
కష్టతరముబూని కాచినఁ గావుమయ్య
గెడపఁ దలఁచినఁ గానిమ్ము జడుమీఁ కేల. ౨౮

వ. అని మఱియు నిట్లనియె, ౨౯

మ. తలనీయంజ పోసంగె దానిఁగని నాతప్పెన్నికం జేసియుం
దలపం డెప్పుడు కంటగింపఁబిఱుసం దార్కాణగానిల్చుచో
నల మున్పక్కిదొరన్న నాతనికి నీకైనట్టి వేరం బదె
ట్టులో సెప్పన్గుదన్న కాళియుఁడు గుట్టుం దెంపితానిట్లనెన్.

సీ. రమణకమను దీని రచ్చగా మావార
లుండుటఁగని గరుడుండు వచ్చి
బెదరింప నాగులు పిరికితనంబున
నెల నెలఁ బ్రజలిచ్చు చలిమికులను
నాయన కుడుగరఁ జేయు నేనటు సేయ
నీక పొల్లాడిన నెత్తుకొంటి
నది కతంబుగఁ దల లడఁగినఁ బడువెత్తి
యిచ్చోటఁబడి డాగి తేను నాతఁ

గీ. డీడఁ దిరిగినఁ జచ్చున ట్లీరసమున
నెక్క జడదారి సాపించు టొప్ప వింటేఁ
గానఁ బోయెద నాదీవి గాలుకొనఁగ
సెలవె యని యాఁడువారితోఁ జనియె సాను. ౩౧

కం. ఆపా మరిగిన మొదలుగఁ
దీపించగు సీసుద్రావి దిగులు నసిపి రా
లాపరు లొడ్డుం బట్టిన
చే పిల్లనగ్రోవివాని చేతఁ దలఁపుమా. ౩౨

ఉ. బిడ్డనిఁ బాము పట్టినని బీదలఁబోలె నెగుల్లలంపఁగా
నొడ్డునఁ జూచుచున్న పజ లూపిరిదెప్పిరి కూడివచ్చుచోఁ
గడ్డిపొలానఁ బల్లియటుఁ గాఁ జను త్రోవఁగనంగ లేక నా
దొడ్డిగ రాత్రైనఁ బడిదోఁగిరి నిద్దురమబ్బుపోలునన్. ౩౩

కం. అందఱుఁబడి నిదురించెడు
సందునఁ గార్చిచ్చు రేగి సదమద పెట్టన్
వందుర మేల్కని సిరి మగఁ
డెందేమని కళవళమున నిట్లని పల్కెన్. ౩౪

శా. ఏలా యెడ్పదరొక్క పెట్టతొలిజా మేతెంచె నాయొంటమిం
బోలంజూడుఁడు చిచ్చువుట్టదుగదా పూరిన్ రవుల్కొంచుచు
వేలిల్రక్కసుఁ డెవ్వఁడేని దురుసై వెన్నాడిపాలించెనా
జాలిం జెందుట కేమియంచుఁ గినియం జాపొందు కార్చిచ్చునన్

కం. ఈచిచ్చునకా జడిసెద
రేచను మిమ్మడఁతుననుచు నెదురేగి వడిం

దాచినఁ జల్లారక పొగ
లేచుట గని డిగ్గ్రద్దావ నిది తెలియనుచున్. 3౬

గీ. కత్తినేస్తకాఁడు గ్రక్కునఁ గడిసేసి
చిచ్చు మ్రింగె దానిఁ జేడెలెల్లఁ
గాంచి దేవరితఁడు గాకున్న నెరగలి
మ్రింగ నొరులకగునె మీఁగడవలె. 3౭

వ. అని తలఁపోయుచు 3౮

కం. మఱునాఁడు లేపకడ నం
దఱు గీములుసేరి వెన్ను దమపాలిటి దే
వరఁగాఁ దలంచి మ్రొక్కరి
గుఱి నిల్పినచోటి కౌదువఁ గూలుదుమనుచున్. 3౯

ఉ. ఎప్పటియట్ల కారడవి నెల్లెడల న్బసిమేపఁబోయి రా
నప్పలెవారి నందుఁడను నావులమందల మమ్మమిమ్ములం
దిప్పలు మాన్పి ప్రోవఁగలదేవర నేల్పుల ఱేఁడు జాతర
న్మొప్పుగఁజేయ వేలిమికి మేకొని పల్కెమెడాటమందొగిన్

చ. కొడుకగు వెన్నుఁడంతఁగొని నూడని చేతలకొగ్గిమాటసం
దడిఁ బచరింతురేల కన దబ్బర మబ్బులు మేనఁగన్న లో
ప్పెనుదొరసామ్ములే యతనిపేరిటి జన్నముసేయకున్న నీ
పుడమికి వాన లేదె? వినఁబోలునె యిట్టికువాళముల్చెవిన్

సీ. తొలి తాత జగములు గలిగించినప్పుడే
వను లందఱకుఁబంచెఁ బరువు లరసి

మొగులు గుంపులను వాన గురియుటలు వెట్టె
 నవి దప్పి నడువరా దరయుఁడోసి
వేలుపుమన్న కాయేలికతనమిచ్చె
 నంతగా కాయన నడ్డగింప
మానునే బొమ్మకు మారాడ నేరికిఁ
 దరముఁ గాదింతియ తాల్మినుండుఁ

గీ. డేను గలుగంగ మీకేమి యితని జన్న
మున కొనర్చిన దంతయుఁ గొనుచు వచ్చి
కొండ గవినున్న వేలుపుఁ గోరి తలఁచి
జాతర పొసంగఁజేయుఁడు సమయ మీడు. ౪౨

వ. అని చెప్పి యప్పిల్లండు మన్నించిన గొల్లలెల్ల నల్లంబుల నల్లనయ్య జెయ్య నియ్యకొనిన పని ప్రమెయ్యనని తలంచి చెప్పినట్ల యొప్పి తెప్పునం జని కొండ జాతర దాడివడఁ జేసిన నా లచ్చిమగం డమ్మలయందు నెలవుకొని వార లిచ్చు కానుకలు పుచ్చుకొనుటఁ గాంచియు మొరకులగు దొడుకు కాపరులు గట్టు సత్తియే యని యెంచి యొరి కొకళ్ళు తెల్పుకొనుచుండి రప్పట్టున పసిడివలువ దాలుపు వేలుపు నేడువారిలో నొక్కండై తాను నట్ల సేసె నతని నెఱతనంబు దెలియ నేరికి నలవిగాదు. కావున నంతయుం గని తెలుఁగంటి మఱియును. ౪౩

చ. పొగరెగదొట్టి తొల్బుదొరపోరఁడు సెప్పిన మాటఁబట్టి సం
దుగని మిరాశిగా జరుగుదోవదె మల్పిరి గొల్లలిట్టిచోఁ

దగఁదిక నూరకుండనని నవ్వులనొక్క మొగుళ్ళ జీరి బె
ట్టుగ సెలవిచ్చె వాన కసటుంబడి పల్లియ పొల్లు సేయగన్.

వ. అది విని యారుమూఁడు తెగల మబ్బులు. ౪౫

ఇంద్రవజ్రము. వియ్యానఁ జెల్లింపఁగఁ బోదుమంచుం
సయ్యాటలన్దెప్పున గుంపులొంచున్
గయ్యాలకై పోయెడు రాచలోనా
వెయ్యారు లేగె న్వినుదారి వేగన్. ౪౬

వ. కదిసి మదంబుట్టి ముట్టి, ౪౭

సీ. మొదట సన్నపుజల్లు మొనకొల్పి జడి సూపి
బెట్టైన యుఱుములఁ బెచ్చు రేఁగి
మెఱుపుల తళతళ మిఱుమిట్లు సవరించి
తాకుప్ప లంతట రాలఁజేసి
మొగమెత్తకుండంగ ముసరి వానల ముంచి
వరదల తాకు డవ్వారి బఱపి
చలిగాలి విసరుల జంపుగా నెసగించి
గుడిసెల గోడలఁ గూలఁద్రోసి

గీ. మందఁ జీకాకు సేసిన మంచి గాన
కపుడు గొల్లలు గావవేయనుచు నందు
పట్టిజీరిన వారిఁ జేపట్టఁదలఁచి
దిట్టమై వేల్పుదొర కొప్పమిట్ట లేచె. ౪౮

వ. లేచి యేచిన యలుక నిట్లని డెందంబునం దలంచె. ౪౯

మ. తనకై జన్మము మానినారనెదు పెన్దప్పించి నూరంచులం
దిన వాల్దాలుపు కిన్కచే గరువమందె న్వానరా నేమిసే
తునో గందామని కాని మంచిదె యడంతు న్నమ్మి నన్నున్నవీ
రిని నిప్పట్టున గాసిబెట్టి మఱియేరీతి న్ననుఁ గా డాయునో.

ఉ. అప్పటిమాట జూతమని యప్పలె చేరువనున్నగట్టు బా
గొప్పగ మీఁదికెత్తి జడి కోడకు డింతులు పిల్లలు న్బసుల్
తప్పక చేరుఁడన్నఁ జలితాకుల మేనులు జల్దరింపఁగాఁ
దెప్పునఁజేరి రొక్కమొగి దీవన లిచ్చుచు నాలగాపరుల్.

కం. జడి విడువక కురియఁగ నల
జడి చెడి కదువవడకు టుడిగి జతజతలుగఁ ద్రొ
క్కుడుగాకయుండ నిమిడిరి
మిడుకుట లెక్కడివి సామి మెలఁకువఁ గవినన్. ౫౨

కం. బేకామగ రాల్పినుకులు
జోకగు ముత్తెములు గూర్చిచుట్టిన కుచ్చు
లా కొండ గొడుగుఁ బట్టెను
రాకాసుల సూడు చూపఱకు వెఱగొనరన్. ౫౩

గీ. ఏడురేఁబవళ్ళు నెడమీఁక జడిపట్టి
కురిసికురిసి మబ్బుగుంపు లఱచి
కడకుఁ గడుపు లెండి కడలి కడకు వడి
జరిగె వెల్గుతేఁడు జగ వెలుంగ. ౫౪

కం. అడిగని గొల్లలు తమ తమ
కదుపులతో బయలుదేరి కడువేడుక నిం

పొదవి హరిఁ బొగడసాగిరి
మొదలిటి ముచ్చటలు దలఁచి ముదితలు దామున్. ౫౫

కం. అదిగని మబ్బుల వదరుచు
బెదరక గ్రమ్మరుటకొఱకు బిరుసుజెమక వా
లదలకుఁడన మొగులతెగ
ల్వెదరి కుదరకున్న విసివి జేట్పాటు దగన్. ౫౬

వ. ఇట్లని తనలో నుమ్మలించె. ౫౭

సీ. కారులు వదరుచు నోరెఱుంగక మబ్బు
తండంబు నసిపితి దానివలన
మోసంబుగలిగె గట్టె నత్తి గొడుగయ్యెఁ
దెలియంగ నబ్రిమి దేవునడత
పుడమి బరువు డింప దొడుకు గాపరియింటఁ
బెరుగుదునని తొల్లి జేసికొనియె
నది మఱచితి నిజం బాలఁడే యీతండు
నను గాచుటకుఁ బుట్టెనని గడించి
గీ. తలఁపు లీనెడుగవి వేల్పువెలఁదులతికి
వెంబడింపంగ జముదొడు వేల్పటంచుఁ
బొలములోనుండు వెన్నునిఁ బొగడు వేడ్క
వచ్చెఁ దెఱగంటి దొరలతో వాలి వంగి. ౫౮

వ. వచ్చి,

చ. కనుగవకబ్బురంబగు చొకాటపు నల్లనిమేనుపైఁడి ప
చ్చనినువల్లె యొందలపసందగు నెమ్మలకన్నలీకల

కున్నవగఁగుల్కు పెద్దపులిగోరుల బిళ్ళయుఁగల్గు గొల్లపి
ల్లని నలసామిఁగాంచె మొదలన్గతి వాఁకకుఁ జంగటొక్కనిన్

వ. గాంచి నిక్కుదేవుల జక్కని గ్రక్కున డిగ్గి మొక్కి డగ్గ
త్తిక నగ్గలంబుగా, ౬౧

ఉ. మేలిమివాటలంబాగిడె మిత్తినీఁదన్నిన మన్నెబొమ్మయు
న్నాలిదినయ్య మీమొదలు గాంచి గడింపఁగ లేరునేఁగన
న్జాలుదునే కనుంగొనలఁ జక్కగఁజూడుము తప్పిపోతి నీ
పాలిటివారికి న్వెతలు వాటిలఁజేసితిఁ దప్పుగాచవే. ౬౨

శా. నన్నుంగాచుటకేకదా మొదటిమేన న్జేప రూపొప్పఁగా
మున్నీటన్దిరుగాడి రక్కసుని కొమ్ములన్గొమ్మునన్గ్రుచ్చుచు
న్వ్యాన్నానించి మలం గుదుర్చుచటి తాబేలైతి బోనంబులే
కున్నన్జావని మందొసంగుటకు మాకోపాలోప రాకొందితిన్

గీ. ఒంటిగాడవైతి వో జగంబులమేల
పయిడికనులవానిఁ బట్టిచంప
నతనితోడుఁ ద్రుంపనైతివి తెరనోటి
దేవరవు తలంప దిక్కునీవ. ౬౪

శా. బిచ్చంబెత్తుట నాకొసంగెనెగదా బేలైతి మున్పొట్టివై
కచ్చెం రాజులగోలుపుచ్చుటలు నేఁగాఁగోర మన్వొల్పవై
దచ్చింబైనిరుకుత్తుకల్గలుగు పందంజంపి మమ్మందఱ
న్బెచ్చుంజెందనొనర్చితే మనిమిము న్బేర్కొందునాల్గాకఁడా

ఉ. ఇచ్చటబుట్టి నన్గలఁచు హెచ్చుగరాసుల నంజుడానుల
న్వ్రచ్చుటకే నిజంబు తొలివాఁడవు మైమఱచిట్లు సేసితిన్

రచ్చలబెట్టకేలుము దోరా పదినూఱులుమ్రొక్కు వాఁడ నా
మెచ్చిప్రియంబులాడి కలిమి న్దగదీవనలిచ్చి వెన్నుఁడున్.

వ. అంతటం బోక,

గీ. బాసవాల్రొచతలపిచ్చు పసి పిఱికిన
పాలదడిపాల దడిజేసి బత్తిసూపి
పనివిసిరెయె ఱుంకికదుగంగఁ బదపడి వారి
పల్లెకరుదెంచె వెలదుక లెల్లఁ బొగడ. ౭౮

వ. అమ్మరునాటి రేపటిపూట నాటలం దోడివారు దానునలసి మెసవుటకసదుగాఁ నింటినుండి తెచ్చిన వంటకంబు సాలమి డీలుపడి బోనంబులాను వేడుకఁ దోడుకాండ్రతోఁ గప్పు పైఁడిపలువదాలుపు లీదాపునఁ గొందఱు పారులు వేలిమి తొలిపలుకుల చొప్పుఁ దప్పకుండ వ్రేలిమిఁ ద్రిప్పుచున్న వారందేగి మేమోగిర మడిగితిమని వేఁడి వేడిచెడని పసాదంబు దెమ్మని యనిపిన హసాదని గుసగుసనరిగి వారలా బాపలతో నీపజ్జ నాపదవ్వులమేపుచుఁ దాడిపక్కిసిడంబుల యొడయలుఁ మిమ్మడిగి కమ్మని కూరచారోగిరంబులు దేరఁ బనిచినారన వారు కంటికడ మంటలుబ్బఁదబ్బిబ్బులాడెదరు కొంటెలారా వంటకంబు మింటి ద్రిమ్మరుల కారగింపు సేయక నే యగ్గినేఁ బోయక నీయంటిబోయుల కీరాదుపొమ్మ నిన మఱలుఁటగసి వారిగఱిత లరుతపశ్చైరంబుల కొలఁది మిలమిలని యావకూర వేపుడుకాయలునిచిన బువ్వపై పివ్వటించి వ్రేబుడుతలబడి యడకిఁ జేరి మ్రొక్కి తెలియని

మగల యుక్కి వంపుమాటలకుఁ బెక్కు బట్టకుఁడని యప్పవ
సేసిన నప్పుడే మెసవి తెప్పున, ౬౯

సీ. వెలఁదుకలార మీ వేఁడుక లోనఁగూడు
నోడయులు దెలియంగ నోపకున్న
మమ్మెఱింగితిరింక మాను మీకిడుములు
మఱిపుట్టుగల్గదు మగలఁ గలిసి
వేలిమినిగ్గించి వేమరునాపేరు
మదినిల్పుఁ డనుటయు మంచిదనుచు
జన్నంపుచవికంట జరుగ మన్వేల్పులు
జప్పను లఱిగిన జాడఁ దెలిసి

గీ. యింతులా తొలివేల్పుల చెంతకరిగి
ముత్తి తెరవరు లగుటలు ముచ్చటించి
రాఁడులకుఁగల్గు తెలివిలేదయ్యె మనకుఁ
గోడిగంబయ్యె బ్రతుకని గుదులుకొనిరి.

శా. ఏవేల్పిచ్చుదగుల్పుఁగోరి దరులందే నగ్గులంగూర్చి చెం
గావుల్మించు జడల్ తిరుల్మైనయ ముంగాలంటుతో వేడిన
న్రోచ్చవన్దెప్పనకాని సామి వెలఁదు లోచ్చనంబాసంగ న్మది
న్దావాదంబున మెచ్చె వీసు తొలినేదారికీ పారికీ గొల్చిరో

వ. అని తలఁపోయుచు,

కం. ఆవులమేపఁగ వెన్నుఁడు
బో వెంబడి లోయకరిగి పూనిక వెదుకం

ద్రోవఁ గనరామి వారలు
లేవడిడొందముల మందలింపుచుఁ గొదువల్. ౭౩

గీ. మఱలివచ్చి తలఁపుమానకపేర్కొని
ఱెఱుకవిడకకొల్వ నెఱిగి శౌరి
జన్మమంకుఁగుడిచి సరవి వెన్కటిపుట్టు
కొలలరూపుమాపి కోర్కులొసఁగె. ౭౪

ఉ. అంతమఱొక్కనాఁడడవి కన్నయుఁ దానునుబోయి రాలతో
బంతులతోడనాఁడుతరి బారులుదీరిన పిల్లగుంపులో
సంతసనొక్క పిల్లఁడయి చాపగు మొక్కలి రక్కసుండు గే
లింతలు సేయుచుండఁ గనలెన్బలరాముఁడు వానిచేతఁగున్

వ. అపుడు.

శా. వాఁడువ్వేత్తుగనాతని న్బొదివెఁ జేవన్వ్రుపైనుండి ముం
దా డైబల్విడి నేగె నేర్పడు చులాహా యంచు వాపోవఁగాఁ
దోడైపోవక వెన్నుఁడాడ బిలిచెం దూలింపగాఁ జాలుఁ జా
మూడెన్వ్వనికి రాముచేతననుచుం మోసంబు బెన్ గూరిమిన్

కం. రేదిరుగుడు దను నలపఁగ
మీఁదెఱుఁగక వచ్చుపీని మే బలువెంతో
పాదంటఁజూతునని యపు
డాదట నేమనకయుండె నరగడియ చనన్. ౭౫

ఉ. మ్రాఁకులచాటునన్నిలిచి రాపడిరాముని రాలఁద్రోయఁగా
డీకొని రెండు చేతులఁ దొడింబడకుండ మెడన్బిగించి కా

ల్తాకులఁ బొట్టదట్టి బెడిదంబుగ నేలకు నెట్టి ఱొమ్ముపై
కేకసగొట్టి బిట్టడఁచెఁ గీడ్వడి సావఁగ నాప్రలంబునిన్.

ఉ. విలవిలఁ దన్నుకొంచు విడువే బరువైతివి మోవఁజాలఁ బె
న్బలియుఁడవీవు జంపెదవె పారెద వచ్చినత్రోవమూని ని
ర్గలన కెదుర్పనంచు వెతగార్కొనఁ బల్మరు వాఁడు వేఁడిన
న్బలుకక చావఁద్రొక్కె మెడపట్టునఁ గాలమరించి దిట్టయై.

గీ. నోట ముక్కున నెత్తురు లేటికాల్వ
తోటి సరిబార నూపిరి తొలఁగ చనియె
నపుడు గొల్లలు సంతసమంది గంతు
లంత టంతటఁ బచరింప నైరి చెదరి. ౮౧

శా. ఆరాకాసిదురంబున న్నొగులమున్నొజళ్కఁబోవంగ జే
జేరారాముని మీఁద మింటఁ గురియించె న్బాలవానల్గురిన్
బేరుల్మ్రోసెను వేల్పు బానిసెలు కన్బింకంబులవ్వారిగా
బారుల్దీరి పొసంగఁ బాడి రిగురుల్పట్టంగఁ బెన్మొద్దులన్. ౮౨

వ. అంతట వారలు. ౮౩

ఉ. మాపగుటాలఁ దోలుకొని మందకుఁ జేరిన గొల్లజవ్వను
ల్ద్రోపడి వచ్చి చూచి వడి ద్రుంగిరి రక్కసు లెందఱేని నీ
పాపఁ జంప నెవ్వఁడొకొ పంపెను బెన్పగబట్టి వారుబో
కేపగిదిన్నిజంబగునొ యెప్పుడు విందు మటంచు నెవ్వగన్.

వ. కొంతసేపాడికొని తిరిగిజరిగి రామీఁదట, ౮౪

గీ. ఒక్కనాటి రేపటోపికఁ బొలమున
నాలఁ గాచుచుండి వ్రేలుతాటి

పడగ తెల్ల సామి పజ్జకుఁజని పల్కె
రున్నరూపుఁ దెలియ నోపికమర, ౮౬

సీ. ఇచటికిఁ జేరువ నెసఁగు తాపసులమించు
టడవియందులనుండు నావటముగ
గాడిదెరూపున గడిమెకం బొకండు
గాపాడువాఁడౌట గాలికయిన
రాలవు పండులు రక్కసి యొకమీఁడు
పోరుల మడియని పోటరి యని
యటువోవ వెఱచి యందఱుఁగ రెవ్వరు గానఁ
జక్కఁబంపుదె పండ్ల చవులెఱుంగ

గీ. ననిన మంచిదినా వార లపుడెతూఁగి
నడచి క్రమ్మాకుల నూపిన నాల్గుదెసల
రాలి పండిన పండుల నోలినమలి
కూల ద్రోచిరి బెట్టుల గుమురులచట. ౮౭

వ. తెప్పతెప్పనంగూలు క్రమ్మాఁకులు చప్పుడువిప్పగుట నప్పా
లదిండి మొప్పియిప్పెను క్రమ్మాఁకులగుప్ప గూలఁజేయుట కే
దిప్పకాయ లప్పళించిరో నన్నెన్నఁడు గన్నవారు గారొక్కొ
క్కతన్నునం బెక్కుఁబందిఁ ద్రుంపుమనని ఖరాసురుండు
దాపు జేరి యోరీ పూరిగఱిచినం బుట్టలెక్కినఁ బోసిను
మానుల పడద్రోచుట బ్రతుకాస వదలి చేసితిరాయను
యడమున పుడమిదేకు వాలుదాలుపమ్మాటవిని తోకద్రొ
క్కిన కంటి వినఁకలియొనుపున బుసనెఱపుచుఁ గరాసారా

రాప్రొద్దుకొఁనుచు మిద్దె యొద్దఁజేరుతునవిన నవ్వి వాఁడు
క్రొవ్వునని వారొకటి కైమూవేదియని యెగతాళిసేసి వాఁడి
గిట్టలగట్టిమీఁరు వెనుక కాళ్లు గేడించి జాడించి తన్నిన నా
ప్రలంబరక్కసిసూడు నాబారిబడితిఁ వింతేరా యెంతోబిసు
సాడితివీకాలితాపున కేనాయని యాయదుగు లిరుచేతులఁ
బట్టి గిరగిరఁ ద్రిప్పి గొప్ప గొప్పమ్రాఁకుల నొప్పించి సుడి
వడ వడివిసరి పారవైచిన ౮౮

గీ. తొండవలె వ్రేలఁబడి నేల ద్రుంగుచుబడ
బిట్టు పొరలాడి వానల్ల పెకలిపాఱఁ
గొండగవులెల్ల నిండఁగఁ గేకవేసి
మిడిసిపడి చచ్చె దివివారు మేలనంగ. ౮౯

ఉ. గాడిదె రూపురక్కసుఁడు గంతుగొనంబెను సంతసంబుతో
నేడిదె తాడితోపుకడ నిల్వ దిగుల్బారి వోయెనంచు నో
టాడుచుఁ బండులుం జిలుగుటాకులు దెంపుచు నిచ్చవచ్చిన
ట్లోడక సంచరింతు రరుదొప్పఁగఁ గొప్పగుఁ బ్రాపుకమ్మచేఁ

వ. ఇట్లొప్పుచుండ వానతఱిమీఱిన. ౯౧

సీ. కఱవాఁక నీరుచొక్కపుఁ దేటఁగనుపట్టెఁ
బురద బిట్టెండలఁ గరుడుగట్టెఁ
గసవాని పసిగుంపు మిసమిస జూపట్టెఁ
గోర మెకంబులు గూడికట్టె
జాజిపూగాయల జతకట్టు నెగదొట్టెఁ
దెలిక్రొక్కారల వడి పొలము మెట్టెఁ

జేమంతి గన్నేరు చెట్టుల సనవుట్టె
దొరగుంపు కవిసేయు మరులునెట్టెఁ

గీ. జదలుగలిసనంబు వలదెసఁ బొదలఁబట్టె
బీదకాపిత మెతుకబ్బి ప్రేలఁబట్టెఁ
గడవపుట్టువు జనునింటి కడకుఁజేరి
మింట వెలిగెడు తతిఁబస మించిపుడమి ౬౨

ఉ. కన్నుల తుంటవిల్లు సెసకంబుగ విచ్చిన పూలకైమువుల్
చెన్నగు నాఱుకాళ్ల తెగదిక్కవి నారియుఁబూని జవ్వనం
పన్నవ గుంపులం గలప నామనినేస్తుఁడు చిల్కవారువం
బెన్నికమీర నెక్కి మవిఁయెం గొరవంకలదండు వెంటరాన్

సీ. వక్కలాకులు సున్న మక్కళించిన జాలె
యడపంబుఁ గుచ్చెళ్ళ యుందుదోపి
క్రొత్తముట్లలిక కుచ్చులబిల్లల
వడిసీలఁబేరుగా మెడనువైచి
దున్నఁబోయిన వారి దోసిటంబటి దుత్త
కుదురుంచి నడునెత్తి గుంటగుదిపి
చిఱుతవన్ని ముకోక చెరుగు తొగరుకమ్మ
మడత రొండికిదార్చి మలిపి నిలిపి

గీ. కాపుజవరాండ్రు వరిచేల కాపుకొఱకు
నీటుకుల్కులఁ గనఁబడ నెరులుఁనొసటఁ
గొప్పుకందకచిందాడఁ గులుకునడల
పొలము కదుగుట లొప్పు నప్పాటలంక. ౬౩

శా. పండె న్నెట్టపువాసపైరుగుమి దిప్పల్గాఁగ నిత్తుల్బైన
లొబ్బిండేల్గొబ్బర మ్రాఁకులంగలిగెఁ దీవుల్మించె నించుల్మడి
న్బిండన్బారిన పెద్దరాజనము క్రుంకన్గోఁత శాంక్రొప్పఁగా
రెండల్వానలు దోడుతోడ బలు పయ్యెన్నాచసూడుల్దగెన్

గీ. కలుపవలింటి తెలుఁగున తెక్కురాయఁ
డుదిరి వెన్నెలగాయంగ నొప్పుచుండె
మందకవె వేల్పుచే గ్రోవి మరులుపుట్ట
గాణతనమచ్చు పడఁజేసె గరితగుమికి. ౯౫

వ. ఇట్లప్పల్లె మచ్చెకంటుల యుల్లంబు లల్లుకొని పెల్లుఱేగి తమకంబు వెల్లివిరియఁ బాడినగ్రోవి రవళికి మేనులు పొంగి చెంగున నిండ్ల ముంగిటిచోటుల నీటుగా నిలిచి నిలువంగాక తమచేతిపనులువిడచి పఱచుచుఁ బూఁబోఁడు లేమగడ నల్లనయ్యగాక యిల్లేల తల్లి చెల్లెం డ్రల్లుండ్రు మామ మగలేల నని పాసి కాపురంబులు రోసి యడవి తెరవుపట్టి యొకళ్ల నొకళ్లెచ్చరింపక మచ్చరించి మఱుం డుచ్చిపార కోలవేయు దారి దరియెఱుఁగక కట్టుచెరుంగు లూడములు కంప జొంపంబులం బెంపగు పొదలగుంపుల కడ్డంబుగాదాటుచుఁ బాడిన పాటచోటుసూటినారాటంబు నంబోయి తన్నుడాయ నమ్మాయలాడు తాయిలారా బోయలీప్రొద్దుదాక రారే కడఁలిగి రేస్లైన వత్తురే కద సత్తులరమర లేక తిరుగు నీసరిప్రొద్దున నెమకం జనుదెం చితిరే చాలుచాలునని పలికి మఱియు వారు వచ్చిన ముచ్చటల మచ్చెకంటులవలనఁ దెలిసి మెలవులేనివాఁడ

పోలె పాలుమాలక నేటికోలియని యుగ్గడించి గీటునం
బుచ్చుచు నిట్లనియె. ౯౮

చ. పడఁతుకలార పిల్లలను బాముగుల న్మగల న్మఱందుల
న్విడచి పెరాసవచ్చితిరె వేమక కాఁపులగూఁపుటంచులం
బొడమిన నొండొరుల్తెలిసి పోకలఁబోవుదరె మేరదప్పి పో
నడుతురె చాలుఁజాలుఁ దగునా యిటువచ్చుటలాపుఁడీరుచుల్

సీ. అమ్మ యెఱిఁగిఁ గ్రిమ్మరి యని తిట్టు
నత్తను దెలిసిన మొత్తివిడుచుఁ
దోషికోడలు విన్నఁ దూలించు నగతాళి
మామ జూడంటినఁ దామసించు
నక్కసెల్లెండ్రు గన్నప్పుడే కాదంచు
రెవ్వరుగాంచిన నీసడింతు
రాఁడయని మదినాట నెడఁ దలఁ గొరిగించుఁ
గావవీఁడిది గన్నఁ గిలఁతవెట్టు

గీ. మగనిబారిఁబడిన మఱియేలుకొనఁజూడఁ
డన్నఁ గన్న నూతినపుడె త్రోయు
లంజెతనము మేలె నంజిలిపడనేల
ముందు మొదలఁ దెలివి మోసపుచ్చి. ౯౯

మ. పులులుందుప్పులు నిండియున్నయడవిన్బోరాను వేవెల్గురా
కలవిట్లీసరి పొద్దువచ్చితిరి కాల్కాల్గొట్టుచు న్వెఱ్ఱిలై
తెలిసెన్ జక్కనఁ బోవు డిండ్లకడలన్దెల్వొందియుండుండు మీ
వలపుల్దీరుతు నిట్టిసేఁత దగునే వాల్గంటులారాయనన్.

శా. ఆపూఁబోఁడులు లంపటంబడుచు నాయంబానె యుష్ట్రైగనం
చాపంబిడ్డలుబంధులున్నగలు మీఁకడ్డంబె పొండంచుఁ జే
రేపన్దావుల మోపు తేరి దారపేరెంబెత్తి సిస్జేది నా
మీఁపట్లస్వేడవాఁడఁ జూపెదవు మేలే దిక్కువేగున్నదే ౧౦౧

చ. తగులము లెచ్చటంగలవు తాత బళా తనమాఁతుఁ గోరఁ డే
జగములు మూఁడునేలు దివిసామి తమిస్జడలయ్యె పైదపి
న్నగిలెనుగాదె చంద్రుఁడు దాపక మాటలనేటు కానిదా
మగువనుఁ జూలొనర్చి వెటమాని తగుల్బచరించెఁగానపే.

ఉ. పిల్లనగ్రోవి మ్రోఁత మము పెద్దగుమక్కువఁ జెందఁ జేయ న్రే
పల్లియదాటి సిగ్గవయఁ బాల్పడివచ్చిన మమ్ము బొమ్మనం
జెల్లునె యేలుకోమ్ము మిముఁ జేరితి మింటికి మళ్ళిపోవఁగా
నొల్లము పెక్కులేల చనువొప్పఁగ నేలుమటన్న పెన్నుఁడుక్.

కం. కొంచక వచ్చిన వీరల
మంచిదియని కలయఁగాదు మఱపించెదనం
చెంచి యటుసూడ మగుగై
ముంచె మదులఁ గడలిలోన మునుకొను వేడ్కన్ ౧౦౪

గీ. అదియెఱుంగక పడఁతు లయ్యడవిలోన
నడలు దళిమట్టఁ జాలక యలయుదాక
తిరిగి వెతకుచుఁ గన్గొను తెరవు లేక
పిలిచి కూకలు వేసిరి బిగువు లేక. ౧౦౫

సీ. పెనుతాడి మ్రానిఁ బిల్లనగ్రోవిఁ గలవాని
గాడింబ పొంబంచెఁ దాల్పువానిఁ

బొగడఁ దామరఱేకు దెగడు కన్గవవాని
గుఱిగింజ తల నెమ్మికుచ్చువాఁ
బొన్న చెట్టా నల్లవన్నె మేఁగలవాఁ
గలిగొట్టు వాపసిఁ గాచువాని
గోరంటరొమ్మున గొప్ప మచ్చఁగలాని
వావిలిచే జట్టువాలువాని

గీ. యడవియందునఁ గానరాయనుచు మ్రాఁకు
మ్రాఁకుఁ బొదపొద నట్టున ట్టాకు నాకు
నడిగి వేసరి కఱివాఁకయండఁ జేరి
దండితెగువల బలువగఁ దగిలివిసివి. ౧౦౬

వ. మఱియు నాతొలివేల్పుకంటువు పయిం గల్గు కూరిమి నేదారి నెఱుంగని చిలుకలకొలుకు లెల్ల నొక మాటమీఁద విట్లని పొగడిరి. ౧౯౭

కం. నీవీ పల్లెంబుట్టిన
చేవంబెను పొందె మంద చేటుఱుఁగక మ
మ్మావఱకు నేలి విడచినఁ
బోవుదుమే చచ్చి నిన్నుఁ బొందక కృష్ణా. ౧౦౩

చ. చనుమొనలంట నీయడుగుసావు చుఁభొండులవింత లేర్పడ
న్మనుపుము మానితే వినెడుమాటలు లేవిఁక నీదు చెయ్వుల
న్మనుపుచు గుట్టలన్దిరిగి బాయుట లూపిరిసత్తెమట్లు నీ
గిన జవరాండ్ర పెన్కొలల కీసులు నీకగుఁజూడు వెన్నుఁడా

గీ. విసపుదారివలన విసరిన సుడిగాలి
రూపువానివలనఁ బాపమేని
వానివలన, తాలవాన పెన్నడిదెబ్బ
వలన మనిచి మరుసిబారి విడతె. ౧౧౦

శా. నీచే సోకుడు లేక పూవిలుతుచే విల్వ్రాంగ లేమింక వ్రే
రాణా! రా కనుదమ్ముకోపులనుముక్ రారాపుసేయుంపుమిం
కే చాయుంగనలేను సోపు దరిదికే.-నీవు తాళంగలే
మీచామల్లను వారెని మతకమేలే జాగుబాగేహరీ. ౧౧౧

మ. తొలి నోము ల్లోనసాగెఁ గానకగుగం ద్రోఠంపువేడ్క-న్నిను
ల్గొలకన్గొణెదవంచు వచ్చితిమి మాదోసంబు మోసంబు లె
ట్టులో మాకప్పనసేయు కీయడవి చెట్టుంగుట్టలం డించి రా
వలఁతి నోఁచ్పుదుమే వెఱంగొతుక మాహాగుట్టు మిట్టాడఁగ కా

సీ. పెదవి తేనెలొసంగి బిడెమువోఁ జేయరా
కౌగిట బిగియించి కదియరార
చను మొనల్జుపుకె త్తఁ బిగొని మనుపరా
పలుగంట్లఁ జెక్కు-ల నిలికికొనర
కన్నులు ముద్దాడి కవితనం బునుపరా
నెఱుల విరుల దండమురిమి చనర
మొగమిచ్చినను మించి ముచ్చటఁ దేర్చరా
మరుగంటి చేతులమాటి కొనర

గీ. యనుచు మరుపూల తాకుల నలఁతఁబడుచుఁ
జేడెల్లను జోహారు సేయుచుండఁ

గనికరము మించి యెల్లయ్య గానుపించె
వగచు పడతుల ముందఱ మిగులకూర్మి. ౧౧౩

కం. వచ్చిన వెన్నుని గన్గొని
మెచ్చుచు సంతసముతోడ మేనులు పొంగం
ముచ్చిరుట వెడలి మొదలం
జచ్చి తిరుగఁ బొడమినట్టి చందం బత్వోల్. ౧౧౪

సీ. పలుకరించని దేలపలుకుదు వనెయొకర్తు
మోసగాడని దూరె ముదితయొకతె
చులుక సేసితివి గచ్చుల గాడయనెనోర్తు
పిన్నసేతలు బెక్కులెన్నినోర్తు
పారిపోయిననుఁ దప్పదురాయనె నొకతె
యాగాపరికి వెళ్ళియువియె నొకతె
తప్పేమి? యలిగి పోదలఁ చెదవనె నోర్తు
వలపించి తొలఁగు టొప్పదనె నొకతె

గీ. పలుచెలంగుల నిట్లనిపలుకుచుండ
వివవి యట్టులవాగల వెతలడంగ
నందఱకు నన్నిరూపులై యపుడుమెలఁగి
వేల్పగుట డెందములఁజిక్కి విసువులేక. ౧౧౫

వ. ఇట్లా చేడెలుందాను గోడిగంబులాడి చూపుల కూడికల
వేడు మాటలనూడిగంబులసూడిగంపుసేతల పోడిమలనీడు
జోడులేర్పడ నిండుపున్నమ గండు వెన్నెలల బయళ్ల
మొయిళ్లనంటిన మించులవలె నంచయానలంటిరాఁ దిరు

గాడి కప్పురాపగడంబుల సరిగూర్చిన పేగులోనా నొక్కొ-
క్కయువిద కొక్కండుగా జతపడి యేర్పఱచిన దొడ్డికట్టు
నడిబొడ్డునఁ బిల్లఁగ్రోవితో మెల్లనఁ బాటఁబాడుచు నిలిచె
నప్పటివారి వేడుక లెట్టివారికి లేవయ్యెనంత ౧౧౬

చ. అలసితి మాటపాటలఁ బినాతనితోఁ గఱిపాఁక నీటిలో
మెలఁగుదమంచుఁ గొమ్మలును మిఱ్ఱగు బానలు నీతకొయ్యలు
నెలఁగులదాపరించుకొని కేకలు వేయుచుఁ జేరియొడ్డుపై
వలువలు విల్చియందఱు గబాలునదూకిరి నీటిలోపలన్

వ. చెలరేగి తిరుగులాడుచు ౧౧౭

రగడ. కలికిగులగులబోయెదవునిక్కంపు వెయిసళులతావుమళ్లుము
జిలునఁబుప్పొడిఁగప్పలంబడఁ జిమ్ముకుముతామరలసళ్లుము
యువిదపదరకుమిచటవాలుగులోప్పుమడుగిదితూరిపయఁబడుఁ
బనలు బోవిరిసినవి కలువలు బంతిఁగూరుతు దెమ్మువలపికు
ముగుదముందఱ నాచుతీవెలు ముసర సందీదాడఁ బోవకు
తొగరు కెందలిరాకుచాటున దూఁగునం చలపిందుబోవకు
చెలియయల్లదె కంటివా? తడిచేతివాలుర పెద్దకొక్కెఁగ
పులుకు పులుకునఁ జేపపిల్లలఁ బొడుచుచున్నది తేపకొక్కెర
పడఁతి! చూడవె తెల్లమబ్బులు పండగిలఁబడి నీటనిక్కుచు
సుడులబడి గిరగిరగఁదిరుగుచుఁజొక్కె నావలఁబోవనిక్కుచు
తెలుపతొమ్ముననీరు నాపై దిట్టనని చిమ్మెద వయినుమడి
తెరలకుండఁగ దిరిగిచిమ్మనఁ దెప్పరిలలేవెఱఁగి కొనుబడి
బుడుతసామిఁబనఁటి యీఁతలఁబోయి ముట్టెదఁ జూపుమిత్తతి

గడఁగి వాతోఁజలమునేసినఁ గాలఁద్రొక్కుదుమిడుకబిత్తరి
యనుచుఁ బైదలు లీలలాడఁగ నలరి వెన్నుఁడు వారివెంబడి
చనువుమీరఁగ నీటిలోఁబడి జల్లులాడెమరుద్దగుల్పడి౧౧౯

వ. ఇట్లు కొంతసేపు పప్పుల తెప్పలం దేలి యొప్పుల కుప్పలుం
దానును ముప్పిరిగొను వేడుకలం బడుతటి లిబ్బులబ్బిన
సామిబంటు కొంటెతనంబున శంఖచూడుండను వాఁడు
కొమ్మలలో నెమ్మొగలవారిఁ గొందఱఁ జిందరవందర సేసి
యెత్తుకొని జరుగఁ గురంగటనున్న వెన్నుండు వెన్నాని
యురికి యోరి పిరికి మొఱకుతనంబేల క్రేతల నాఁగుట
మానుమనిన నా జక్కులయ్య కూరిమి బంటు కంటగించి
మొకరియై పదరిన పదరకుమని నల్లనయ్య బల్లిదుండుగావున
నెల్లిదంబాడి బాడిసెలంబోని తన వాఁడి గోరుల వానిఁ జీరి
కూలిచి డీలుపడకుండని చానల నొందఱఁ గూడంబెట్టి
యిట్లనియె. ౧౨౦

గీ. మిగుల నిప్పుడు వచ్చిన మేలటంచుఁ
గాని మీ యిండ్ల కడకేగి కాపురముల
నుండుఁ డేఁగోరినప్పుడు దండఁజేరి
వలపు గడతేర్తుఁ జనుఁడన వార లరిగి. ౧౨౧

గీ. గీముల్లఁ బఱుండ మగవారు కీలెఱిఁగియు
మారుమాటాడకుండి రమ్మాడ్కి జరిగె
కొన్ని నెలలంతఁ గంసుని కోర్కెఁ దీర్ప
వచ్చు రాకాసిమూకల వచ్చు టెఱిఁగి. ౧౨౨

కం. వేలుపులు గుంపులై సిరి
నేలెడి దొర గాక మాసియే కృష్ణుఁడటం
చోలి గుజగుజల ముచ్చట
పాలై రిత్తెఱఁగు జరుగుబడిగాంచి వడిక౯. ౧౨౩

వ. కంసుని తొలుతఁ బంపుడువడిన వారిలో వాఁడుగావున

సీ. కుఱుచగట్టెలఁ ద్రొక్కుడుఱువడి మనుగాడఁ
దోఁక ద్రిప్పుడు గాలి ద్రమాఁకు లగలఁ
చికిలింపులను గొల్లచేడెలఁగాఁ జూడఁ
గనుఁగొలంకుల నెత్తు రినుమడింప
జూలు జాడింపులఁ జుక్క లురిలి రాలఁ
బలు గొఱుకుడు చప్పుడులు సెలఁగఁ
జుట్టుపేరెంబుల గట్టులిట్టటుదూల
ముట్టెత్రోపులఁ బసి మొఱలు మీఱ

గీ. మందపైఁ గేశి యనియెడి మడియతట్టు
రూపు సెలువొంద గంసుని ప్రాపు బలిమి
వెన్నుని నడంపఁ జనుదెంచి విఱ్ఱవీగు
టరసి పరువెత్తి రెల్లఱు నచట బిలక. ౧౨౪

ఉ. ఈసున రక్కసుండు మడియించు తలంపున వచ్చుటప్పుడే
రోసి యశోద బిడ్డఁడు గురుల్మొగమావిన నెత్తగట్టి రా
కాసి వెఱవ్వడంకు పసిగాపులపైఁ దగ దీవు వోవఁగాఁ
బాసిన నడ్డపెట్టి జముపాలికిఁ బంపుదు రమ్మటన్న చో౯.

ఉ. వాఁడు గిరుక్కున న్దిరిగి వాడలచేడెలతోడ బింకము
లాడుటగాదు చిక్కితివి ప్రచ్ఛద మిన్నది వెన్కడెక్కల
న్గాప మొగంబు ద్రిప్పి తిరుగన్గరవ న్గనుకింప వ్రేల పి
ల్గొఁ దరచేత మొత్తె నొస లాకసమంటి   ఋక్కనన్బడన్.

ఉ. వెంటనె లేచి వాఁ డులుకవేదురనా   ంనెఱింగి ము
క్కంటిలకోరి చేనొడిసి గట్టిగ దాడలనె   త్తిపట్టి ము
క్కంటగ జక్కనంబొడిచి యాతనినొం   బీకమూరి క
న్గంటల నెత్తురుబ్బబడిఁ గూయుచు సొమ్మలువుఁ స్రేఁగూలెఁ దాన్

వ. ఇట్లు గూలిన,

గీ. గొంతుకోలు ద్రొక్కి హూర్పుండి యూపిరి
తాపిరించ రుండఁ తల బిగింపఁ
గడుపు దోసపండు గతిఁ గ్రీవి లోఁ గాఁటి
వెడలిపోయె మేనువడియె నచట ౧౩౦

చ. అదిగని గొల్లచేడియలు హా బలురక్కసుఁడే గుడెంచి ని
న్నుబదవి మదంబుదక్కఁబడి పోయె నెఱింగితి మీవు నేలవే
గదుముట కీకటన్నొబడమి యావులగాపుల మమ్ము గాచు నీ
మొదలిటిరూపదిట్టిదని ముచ్చటలాడ నెఱుంగవచ్చునే?.

వ. అని కొనియాడిరంత.

సీ. ఒకనాఁడు తెరగంటి యొకిమీని పనుపున
జగడాలదిండి విజ్ఞాఁడడిగ్గి
పుడమిని మదిరెలోఁ బాలుపొందు గిన్నె పే
రిటిరాచయింటి వాకిట్లిబయుళ్లె

నిలబడి మొగసాలఁ గలవారి గనుపించు
కొని తనరాకడఁ బనుప వాతఁ
దంతిపురమునుండి యరుదెంచి కాత్రల్ల
మరిలచి లోఁజేర్చి యడుగఁ జెప్పె

గీ. మందలో రామకృష్ణులు మనుట నీదు
పంపుడుల మాఁకేగిన బలియులైన
పొలసుదిండుల పడియించి వెలయుచుంటఁ
జెల్లెలికిఁ బుట్టి మామందఁ జేరుటయును. ౧౩౩

కం. వినుమింకొక్కటి దెల్పెద
వినుగూల్పఁదలంచినారు నెరవరివైన
న్దనుముటకు ముందె తగునం
తనకాషరసికొనుమనుచుఁ దరలె ద్దివిక్షా. ౧౩౪

కం. ఆయనపోయినపిమ్మట
నేయనువున బ్రతికెదనుచు నెంతయువగలౌ
పోయిమఱచి మరిదెప్పిరి
పోరెం బెద్దయ్య మేడపొంతకు వడితోఁ. ౧౩౫

వ. అల్లవోయి యాయనంగని నీయాగడంపు సేఁతలెఱింగితి
నెఱుంగనివాఁడపోలియుండి నాకావు నీవయొప్పితి వప్పు
వని నమ్మరాదని జగడించి తెగడి మొగసాలసావడి లేవ
డిగా నీబడుగు ముదుక పినుపగొలుసుల సంకెలల బిగియిం
పుండని తన నమ్మిన బంటులం గ్రమ్మించి చెలియలి
మఱంది నట్లనే కస్తిపాలుసేయించి గట్టిబిరుదులగు జట్టుల

రావించి నట్టువసాలఁ గాపురంబుండ నియమించి తనయింట
నున్న కోరకొమ్ముల మొకంబు దెప్పించి యాముండటి గుమ్మం
బుంబోర నిలువఁగట్టించి తక్కిన నెచ్చెలులనెల్ల రావించి.
వారితో మంతనంబునఁ గావిన్నద తయిఁ దెలియం
జెప్పియుఁ గాపుగా నుండుండని చెప్పి తగుమంతురులతో
సలిపిన మంతనంబున నొకయుపముఁ గన్పట్టి సింగాణి
జన్నంబు సేయుదు మేతెండని పిన్నపెద్ద లందఱుం గలసిరాఁ
దోడుక వచ్చుటకై నంపుపల్లె కక్రూరండను బంటుమానిసిం
బిలిపించి యతని కరదంబు బూన్పించియిచ్చి యనిపె
మఱి యతండు ౧౩౬

గీ. పోయివచ్చెదనని రాచపొంత విడచి
క్రుంకుమెట్టకుఁ బచ్చని గుజ్జుపయ్యో
జరుగునంతకుఁ బల్లియ సరస కరిగెఁ
దోడుకు కాల్దువ్వదనుముంప దూగి నడచి. ౧౩౭

ఉ. త్రోవనుబోవుచుండి మదిఁదోరపునెమ్మివొసంగఁజూచు పె
ద్దేవరగొల్లవాడ బడిఁ దెంపరిఁ జిచ్చిమూకవానిగా
నే వివరించునో తొలఁగు నేరుపు లేకిటు వొమ్మటన్నచో
నీవలకేగుదెంచెనని యెంచునుపెంచునెయల్క నాదెసన్

చ. మయిదునఁ జావమొత్తఁబిలుమంచుననంపెషి చోటనాకుని
మ్మొయిఁ జనఁదీరదంచుఁ బెరిమం దెగ జెప్పక నిచ్చకంబుగా
మెయిఁకొనుటిన్ని పోకలకు మెల్కవ దళ్కొనెనింకనిక్కము
న్నయిఁకొన కాడిదబ్బరలు గాంచుదునొట్టులు మేలుచాలొగిన్

గీ. అనుచుఁ దలపోసి నిజమూఁడి యచటఁ బ్రతుకు
దనుచు నిబ్బరమంది నల్లయ్య యింటి
ముందఱ రదంబు డిగ్గిన ముచ్చటరసి
జాగుసేయక తపోసె జరుగు ఘనులు. ౧౮౦

ఉ. ఏలికపంపునం బిలువ నెక్కుడు బత్తుఁడు వచ్చి వాఁకిట
న్నాలిడ మేలెదుర్కొనెదఁగ్గాయని వెన్నుఁడు విందుకూరిమిం
బ్రేలును దానుబోయి సరవి న్దగు మన్నన గారవించి యిం
గోలున సేమమారసి మొగుల్లొదమించు మెలుంగుతోనను౯

ఉ. తాత పితాను లేక కాఁ ఱతల్లిఁ గఁ ద్రావి మెలంగుచున్న వా
డే తలిదండ్రులు లేమవిరి యీవిటవచ్చి బెఱింగి మామ మ
మ్మీ తటినేరిచే నెఱిఁగె నిక్కడనుంకుట తొంటివోలెనో
లాఁతి పడల్పడిల్పి మఱిలగ్గుఁదలంచెనొ తెల్పుమంతయు౯.

వ. అని నెయ్యంపుమాటలాడు జట్టువాల్పట్టు దొరతోడ

సీ. అక్రూరుఁడిట్లను నయ్య గుట్టాడుదు
నెవ్వరు వినఁగూడ దింతపట్టు
సింగాణి జన్నంబు సేయుదు మింపు రాఁ
బిలువుమించంపె నన౯ దులువమామ
చేబెఱుంగఁడు మిమ్ము చెఱుపు తలంపున
నానను వెఱచి యిట్లేను వచ్చి
నాఁడఁ గుచ్చితుఁడ మంగాడి నన్మడియించు
మీ దోసమడగించి మెలమినేగి

గీ. పగతుఁబోరిగొను మని కాళ్లపజ్జ వ్రాలి
విన్నపముసేయఁ దిలకించి వెన్నుఁడపుడు
మన్ననల గొప్పఁజేసెఁ గానున్న తెఱఁగుఁ
దెలిపి లోఁగల దుడుకుఁబో నులిమెఁగడక. ౧౪౪

కం. నడురేయి జరుగ నిదురం
బడి వేకువయగుట లేచి పల్లియవారిం
బడవాళ్లఁ బిలిచిఁకూరిచి
వడి మదిరెకుఁ బోకఁదెల్పె వారలకెల్లన్. ౧౪౫

వ. అంత, ౧౪౬

చ. అలిగినముద్దరాండ్రఁ గలయ న్మగలన్నలు దాటకేగువా
రలు పయినంపు వేడుకలు రట్టులొనర్పఁగఁ దాపసుల్మదుం
గులుగొని యేటికయ్యలకు గొబ్బునఁ దానములాడ గుర్తుగా
నలువదగిల్పెఁ దూర్పుదెస నాఁగనుజొప్పడె వేగుజుక్కదాన్

ఉ. బాపలుఁకాక రాదొరకుఁ బట్టిన దోసిటనీరుసల్లఁగా
దాపిడియుంచుఁ దెల్పుగతి దారసిలె న్దొలుఁదొల్త నెఱ్ఱనౌ
దూపున పిచ్చుకుంటి పొగరుందగు వెలులువానిఁజూచి గొ
ల్లాపెలు సల్లలమ్మఁ దల మనాపుదఁరోపి కెబుంగ బానలన్

ఉ. మిక్కుటమైనకూఁతలను మేఁగడునిక్కఁగ మూఁడుదారులం
గొక్కరొకోయటంచుఁ బులుగూరిచికప్పినచప్పరాలపైఁ
జిక్కులకెక్కలంబఱచి చివ్వచు నెవ్వడిఁగాలిగోరులన్
నిక్కదెసల్గనంగొనుచు నేర్పుగఁ గూసెను గోడితండముల్

సీ. చీకటియనునేనుఁబుచు పెన్నింగంబు
జక్కవకవఁగూర్చు జాణకాఁడు
పగలొనరించు సూర్యాదుల చేతుల వాఁడు
వేల్పులమ్మకు ముద్దు గొల్పువాఁడు
కుఱుచకోరికెల సోకులమూక పగవాఁడు
పదిరెండురూపులఁ బరగువాఁడు
ఏడుగుఱ్ఱముల తేరెక్కుఁడు మరకాఁడు
కఱ్ఱివాఁకయన్గూఁతుఁ గన్నవాఁడు
గీ. పొడుపుగుబ్బలి నిచ్చలు పొదలువాఁడు
గుదియదాలుపు కొడుకుపైఁ గూర్మివాఁడు
వడకు తెవులంటు బాపెడి యొడలివాఁడు
చదలుపూనిక మగపడె మొదటిచక్కి. ౧౫౦

ఉ. అంతటనల్లనయ్య తనయన్న నెదుర్కొని మెచ్చటించె తె
మ్మింతకు వచ్చెదే మదిరయిక్కఁగఁ బెన్వగనున్న తల్లిని
న్వంతలఁ గూరుతండ్రిఁగని వారలు సంతసమందఁగం సుసిం
తింతలుగాఁగఁ జెండి పగఁదీర్పఁగఁబోవలెనంచు దండడిన్. ౧౫౧
కం. వ్రేపల్లె గొల్లవారికి
బ్రాపై దొరతనము నెఱపు బలియుని నందు
న్గాపై రమ్మని తరలెను
దాపలనల్లయ్య నడువ దళవాయివలెన్. ౧౫౨

వ. ఇట్లేగుతఱి గొల్లచేడెలుల్లంబుల వెల్లిగొను తమకంబున
గళవళింపుచు మదిరెనుండి యొక్క మొక్కళిబంటు వచ్చి

సర్రిప్రొద్దు జరుగువాక గుసగుసజేసి వెన్నునిఁ గదిలించు
కొని పోయెదువని తిట్టుచు మరలి చనుదెంచు నంతకు
నూపిరి బట్టుదమని గుట్టుమీఱక యుండిరవ్వల,

ఉ. వచ్చినతేరుపైఁ బసిఁడి వల్వయుఁ దెల్లని మేఁగలారలన్
మ్మచ్చికనుండఁజేసి పలుమాటలసందడి వచ్చి త్రోవలో
నచ్చపుబత్తినిల్చి దగఁనాదటఁబాపుకొనంగ వాఁకఁదాఁ
జొచ్చి కనుఁగ్గొనె న్నిగుల చోద్దెముగా నటనన్నదమ్ములన్

గీ. తేరిమీఁదివారు తెరలి యిచ్చటికెట్లు
వచ్చినారటంచు నిచ్చదలఁచి
మరలిచూచి కనియె నరదంబుపైనుండ
నబ్రమనుచుఁ బాగడనయ్యె వారి. ౧౯౧

వ. అంత నకూ్రరుండు వాఁకయందేగాక యరదంబుపైనేగాక
యేదెసంగన్న నాదెసఁ బామకొన్న గుడుసు కైసువుఁ
జోదుం గుఱించి హత్తిన బత్తి నిల్లు వలికె. ౧౯౨

చూర్ణిక.

కఁటి విన్కలి దంటనెంటినంటి తొంగుండు తమ్మికంటి- మిఱ్ఱు
లేని మఱ్ఱాకునఁ దొలి నఱ్ఱాకిన కుఱ్ఱా-పాలమున్నీటి తెలిదీవి
కెలన నున్న బంగరు కోటగల వెలిహజారంబునఁ గొలు
వుండు మన్నదొరా-తీపిగణుపు సింగాణికొతు గన్నయ్యా-
కన్ను లీకలపురిఁదల దిగుగు నమరించిన సెట్టీ- వలమురి గుసు
నువాల్గుదెవిల్పురికత్తి నాలుగు చేతులఁగల జెట్టీ-కొరకొమ్ము
మొఱనఱకలేక విని కరకరినీటి తిరుగుడు మెడ నూడనడఁచిన

తండ్రీ-తొలిపలుకులు దొలంగించిన రక్కసితేని మక్కెవిఱిచి
చంపిన చేఁపయొడలిపోఁడా - కడలి మునిఁగి పొడవడఁగిన
మల మేబలుపున నిలువరించిన వెన్నుబొచ్చె నమరు తామేటి
మేటీ - ఒంటరివై పైఁడికంటి కఁటుఁబంట గెంటి మంటనెత్తిన
సామీ - యరమానిసి యరతెర నోటిమెకంబైన మేఁబూని
జేజేలసూడు గోరుల ముని మాపునజీరిన వెరవరీ - పొట్టివై
దిట్టరక్కసిదొరఁ గట్టిగా మూఁడడుగుల పెట్టు పుడమి నడిగి
కొని వాని నడుగున నడఁగఁ బట్టించితిర జగతులు వేల్పు
రాచ కప్పనసేసినదిట్టా-చుట్టువాల్దేవర మారురూపురాచతో
మొదవుకై జగడించి నేలఁగూల్చిన జన్నిగట్టా - పుడమి పట్టి
దొంగరాకాసి పది గొంతులు దరుగు కొఱకుఁ గడలి కట్టఁ
గట్టించిన రాచపట్టీ - యేనెఱింగితి నిపుడు నాఁడి పులఁగు
సిడెంబుల దొరవై వెలసి మందజెందిన-చావుసుందు చంటి
పడఁతి-సుడిగాలిరాకాసి-కొక్కెర-చిలువ-దూడ-యాఁబోతు
గుఱ్ఱపురూపు నల్లద్రాగుసుల మడియించి మించిన నల్లనయ్యా
మ్రొక్కులు గైకొనుమని పొగడిన సంతసించి - వెన్నుం
డా బంటుమాఁకిసికి - గెంటని విన్నాణం బొసంగి - చెలిమి
వొసంగ మన్నించె వెండియు, ౧౫౭

మ. మగురొక్కప్పుడె తేరిపై మదిరెలో ముజ్జేరిరాఁ డ్రోవరా
సొగసుల్మీరి మిటారులూరి పడుచుల్పెద్దెంబుగా గుంపులై
జగతుల్మిద్దెలుమేడలెక్కి కని రోజంబూలు పైఁజిమ్ముచున్
నగువాజ్జూపులపండువందనియఁగా నల్లప్పనింబాడుచున్.

వ. ఇట్లు సూచిచూచి తనివి సనక ముసరి యొకరి కొక రిట్లని
చెప్పం దొడంగిరి. ౧౫౯

ఉ. గొల్లల పల్లెఁ జేరి చనుగొండలచేఁ దగునంజుడాను నీ
పిల్లసిరొమ్ము సేర్చి చనుఁబెట్టినవా తెగబీల్చి చంపెఁ గా
లెల్లడఁబర్వవచ్చు పొగతేచిన రక్కసురూపుమాపెఁ బె
న్నల్లల పీల్పులం దురమున న్మడియించె నటంట వింటిరే.

వ. అదియునుంగాక,

గీ. వీనువీడొంద సిక్కంపు వెలది వెలది
వీని వీనాని నాతఁడు వేల్పువేల్పు
జోడులీడైనపడఁతికి జోడు కడుపు
దలఁపనబ్రంబుగాదు పెక్కు లననేల. ౧౬౨

కం. అనిపెక్కువగలఁ బలుకుచుఁ
దనివిసనక చూచి మరలఁదో దాపై పై
కొను తలఁపుగదుర నచ్చటి
మునుమునఁ దమి నిలుపలేక ముందఱ సనుచున్. ౧౬౩

మ. జతలై గుంపులుగూడి యాడుకొనఁగా సైదోడులో ప్రేలసం
గతిఁబూఁదోఁటవసించి మాపురకడ రిక్కంబొల్చు పేరింటి సి
బ్బితఁ బెండ్లాడు బలుండు దానుబురి దెల్వింజూడ వేంచేసి ముం
జతనంబొప్పఁగ రాచపచ్చడములం జాడించు చాకిం గనెన్.

మ. దొరకల్లుం బ్రడముమంచివల్వలిడు మెంతో కూర్మిమేలయ్యెడిం
జిరుబుస్సాడిన కీడుదప్పదనిన న్జేయెత్తి బిట్టల్కవా

డెబ్బ కన్గొల్కులఁదోప నిట్లనియె నింకీమాటమూరాడిన
న్దరిదాపయ్యెడి రాచవారువిని పంతంబేల పొమ్మ్మరకన్.

గీ. కఱకు బిరుసుటాన గలవాఁడు చుట్టల
న్కానికరంబు లేదు కర్జమెఱఁగి
యొదిగి దాటుఁడన్న నొదవు రోసంబునఁ
జావమొత్తెఁ గైనిఁ జాకివాని

కం. అదిగని తక్కినవారలు
బెదరునఁ గోకలటు వైచి బిరబిర నురక
నదిరెడి వేడుకముడిగల
మది కెక్కిన వలువలంది మరలెన్ హరి దాన్. ౧౬౭

సీ. పూలమ్మ్మవానింటి పొంతనిలువ నాతఁ
డెమురుగాఁ జనుదెంచి యిరవుఁ జేర్చి
యడుఁగులుఁగడిగి కాతడిఁ దల నమరించి
యేమంటి నినుగంట నిత్తఱినని
కైవారములు పెక్కుగావించి వలసిన
పూదండలర్పించి బుజ్జగించె
నాతనిఁ దనవారియం దొక్కనిగఁ జూచి
క్రిమ్మరి త్రోవలోఁ గాంచుటయ్యెఁ

గీ. గలపములు రాచవారికిఁ గాఁగఁ గూర్చి
వెండి బంగారుగిన్నెల నిండనుంచి
నగరిదెసకేగు వంకరనడలదాని
యొడల మువ్వంకలోనరిన బడుగుదాని. ౧౬౮

శా. ఘాట్టీ కమ్మని గందమిచ్చెదవె నిన్బ్యాంకంబుగా జేయుదున్
బెట్టుల్జూపిఁ గూల్తునన్న నది యబ్బెన్సామితోఁ జెల్మియుం
జెట్టోవల్కఁ ౹ మొక్కయింటికరుదే నెంతేఁ గొండాడిరాఁ
బట్టెన్బొమ్మనిఁ గ్రొత్తరో పెరిమ మొప్పన్ తేఁడు లేల్పుండినన్

ఉ. వంకరకన్నెఁ జక్కవఱుపం దలఁపొందిన నట్టుకాఁడు నా
చెంకికి రమ్మటన్నఁ జని శేవ నెదుర్పడి చేతులెత్తి ము
వ్వంకలు దీరగుంజి పిదపం దగు సేఁతలబుజ్జగించి నే
బొంకుటలేదు నిన్మరలఁ బొందెదఁ గర్జముదీరఁ గొద్దిలోన్.

తే. అనుచు నల్లయ్య దెల్పిన సంతనదియు
డెంద మూఁ సామిమీఁదనే పొందుపఱచె
సంతసట లేచి వేయంచు లమరుకైదు
వ్వానుదొర రాచవాడ కేఁ తేని నరిగి.　　౧౭౧

సీ. గోడలఁజెక్కిన గొనబు బొమ్మలదాఁ
　బచ్చరాజగతులఁ బరగుదానిఁ
బటికంపుగట్టిన బరగుముంగిటిదానిఁ
　గెంపులచూరుల సొంపుదాని
మాణికంబుల గూటి మట్టంబుగలదానిఁ
　బులుదిండి దూలము ల్పొసఁగుదాని
ముత్తెంపు ముగ్గు దళ్కొత్తు నట్టెలుదాని
　బంగారు గడపల రంగుదానిఁ
గీ. గైదువులు సంపపోదులం సింగాణి జతలు
మోటకత్తులు బల్లెము లీటె కర్ర

లనువుపడఁగఁ బెంజాతరఁ దవరుదాని
వచ్చి కల్లుప్ప బొడ్డుసావడినిఁ గనియె. ౧౭౨

కం. ఆసావడి కావడులను
డాసి వెడద వేడిచూడ్కి డక్కొనరిచి కై
సేసిన సింగాణింగొని
దూసి నరం బెక్కుకొనకు ద్రుంగించె వడిన్. ౧౭౩

ఉ. బెట్టుగ నెక్కువెట్టుతఱిఁ బీటలువాఱి సగంబుతుంటలై
మిట్టి బిరాన నేలఁబడె మేలని యందొక తుంటఁ జేతఁ దాఁ
బట్టి యఖాటకున్గవలి పైఁబడుబల్లిదులైన కాతుల
న్గొట్టెఁ దలల్బరుల్బగులఁ గొంచక నేలిక చేరఁబారఁగన్.

సీ. అదిగని కాపువారందఱుఁ బైకొన్న
వెన్నుండు కట్టల్కఁ జెన్నుగుల్క
సావడియందున్న జతనంపు కైదువు
ల్వెళవెళ నుగ్గుగాఁ బెట్టి విఱిచి
దెబ్బకునొక్కని దెసలఁ బాఱఁగఁదోలి
యందున్న వెల్ల నుగ్గొందఁజేసి
బట్టతిట్టుల నగ్గిపాలుగా నవరించి
ప్రొద్దుబాఱెడుదాకఁ బోరుసల్పి

గీ. మీఁదొరకు నూపిరిపూట మిగిలె రేపు
రేపకడఁ దనుగూల్పక నాపమనుట
లని పతాకను జెందిన యచటివారి
తోడ సెలపిచ్చి విడిదలజాడ నరిగె. ౧౭౫

శా. ఆరేవేగులవారిచేత విలుతుంబై పోవుటల్లావడి
నారాకూరముసేయుట ల్తనను దుర్గంజేయవేం చేయుట
ల్జీరదైచ్చిన చాకిఁజంపుటలు మంచింబొట్టిమున్నించుట
ల్జేరన్వీనులఁ గంటగించి పిలిపించె న్గంసుఁడాల్గాపులన్.

వ. వచ్చినవేగరివలన

చ. అదివినినందుఁడల్కవడి యాపులగాపులతోడ వేగవ
చ్చెద మిదిరేయి రామనట చెంగటి వెన్నని వీనులాని నో
రదరగ బంటుతోననియె నాచెడుగిప్పుడు పిల్వఁబంపిన
న్మదుగ బిరానవచ్చితి వెమోనముగల్గుచుఁబొమ్మునెమ్మితోన్.

గీ. తెలివిగల్గిపోయి తెల్లవారినగాని
రామటచుచుఁ దెప్పరా యటన్న
వడకుతోడజరిగి వాఁడల్లు దెలిపిన
నెన్నమావటీని కిట్టులనియె. ౧౭౯

మ. మనఁయుంటఁగల మొద్దులేమగులలో మత్తిల్లిచఁడామదా
నిని గుమ్మంబున నిల్పి గొల్లపిలగానిం ద్రొక్కిమట్టాడఁ బై
కొనఁగాఁ జేయుము వొమ్మటన్నఁజని తా తుందప్పనేర్పొర్పుమా
లిన వాఁడందుఁ బూనెఁ బాలసులు తాల్మిన్జెల్మిఁ బాటింతురే,

ఉ. అంతట మానకాయొడయోఁడవుడెమల్లులఁ బిల్వఁబంచియా
సంతన దెల్పి యాయితపు సంగడికాండ్రును మీఁదువచ్చిరిన్
ద్ద్రింతుమటంచువచ్చి సయిదోడుల గొల్లల నేలపాలు గా
వింతుమగాక యన్నబలు వేసఁక బల్కిరి వాదునమ్మికన్

చ. పగదగఁగల్గువేల్పుదొర పాముపయిం బవళించు మన్నెబొ
ట్టుగ సెగకన్నుఁ గల్గుదొర డొక్కపసిండిగనున్న వేల్పు మా
మగటిమి మించఁ బోరునకు మార్కొనఁ బూనిక సేయ రట్టిచోఁ
బాగరునవచ్చు గొల్లలకుఁ బోలునె మమ్ములయింపదేవరా.

గీ. పాలుపెరుగు నేతి బలుపులా మాత్రోడి
సరిపెనంగి బ్రతికి జరుగువారు
గరిడి ప్రొద్దుబోడుపుగాక ముందరసేరి
వారిఁగూల్పకున్న వాసిచెడదె. ౧౮౨

వ. జాగేల పోయివచ్చెదమని చాణూరుండు మొదలైన వార రుగుతా దొర మెరమెర యడంగక డెందంబునఁ గుందాడ నింతకుమును నాపనుపున నేటితుదకా మందజేర నంద త్రేవి శేద్రిమ్మరులరిగి పోరి యీపాపలచే రూపుమాసిరి వీరలీజగంబున నన్నడంచుటకై పుట్టిన చుట్టువాల్సామి మారుమూపులగుట నిక్కంబు నాసరసకీవర కిరుమారు ముమ్మార్రు దుర మోగిరమ్ముగాఁ దిరుగాడు జడదారిచ్చి యీకతల్ల మొత్తిచెప్పె నాయన మాటవీటిం బుచ్చితి నమ్మనైతిఁ జెడితి పదియునుంగాక మొట్టమొదటఁజదలాడి నప్పుడు చెలియాలిం గెడప నుంకించినదియె తగవు అట్లైన నింతవుట్టునుగదా! యత్తటి నావెలఁది పెనిమిటి నోటనాటి వెన్నుండె మైదుపల్కులాడి తప్పించెనోటు? ఐనంగానిమ్మ రాచతొలివేల్ప నీమలివేల్పుచే మడియింపంబడిన నాయన మొదలి నెలవుఁజేరెద నడియు మేలు చెప్పరాని కొలలోన

రించిన మొదలింటి రక్కసిమూక లీఁగుడుసు కైనువుదోర
తోడ జగడించి యెటుకుమొగ్గంబై సమసి యాతని యురు
వుసేరుటలు విందుమే కదా జళుకొందిరయైన చుట్టరికంబున
నైనఁ బగనైన బత్తినైన నెక్కరూపైన తలంపు నెలకొలి
పినవారికి ముత్తిగలుగుట నిజంబని యేదెసనెయ్యది గన్న
వెన్నుఁడగాఁ దలపోయుచు సారెసారెకుఁ గొనియాడుచుండె
మఱియును.

ఉ. అంతట కన్నుమూఁతపడి యంతనె మేల్కను నంతలోవల
న్వింతలుకొన్నిదోఁచెనొక వేదురుముద్దియ యేడ్పుమోముతోఁ
జెంతలఁజేరి నన్నవయఁజేరుము దిక్కకనీ వెయంచు ను
క్కింత మరుంగుఁజూపి చనియెందుదఁగన్పడు మిత్తిసత్తియై

ఉ. ఆకలఁగాంచి లేచి కలయం బరికించుచు నింటిముంగిట
నొప్పికలఁ బోవుడొండమునఁబొక్కుచునుండఁగ వంగునక్కపె
న్నూకలు నివ్వటిల్లెఁ జెడుగూబలు ఱెక్కలు దట్టిపాఱెఁబ
ల్గాకులు కేకల౦దిరిగె గాడిదెగుంపురొద ల్గుమర్కొనెన్

గీ. ఇట్టికొఱగాని సకినంబు లెల్లఁగాంచి
బ్రతుకు టాసనడల్చి రే బట్టబయట
నిలువఁ జిటికె సడల్పిఁట్టులను బగలు
మొగము గనవయ్యెఁ గాకరా మొలకమించె. ౧౮౭

మ. తొలివాడాడిన మాటఁబట్టి నిదురన్రాగాడుచున్ లేచి వే
ములుగోలంగొని దొడ్డిలోన వెదుకన్మక్కారుగా నున్నయే
న్గులలో నెన్మిది చోటులంజమురు కాగుల్గ్రొద్దిగా జారు మొ
క్కలినొక్కన్గుఁగాంచి తెచ్చివిలిపెన్గల్కందఁగానెల్లరున్

సీ. బుసముక్కు కొనల వెక్కసముసూపెడు దానిఁ
గసగస రావుల మెసవుదాని
సిగిరంబు లన నెత్తి సిస్తుగుబ్బలదాని
నడుగు ద్రొక్కుడుల రాల్గెడపుదానిఁ
బలుకొమ్ము దుగదుగ చెలువమ్ము గలదానిఁ
జెటలఁ బోలిన చెవులదానిఁ
జంద్రనిభ్వలో నాఁ బొసంగు కన్నులదానిఁ
గుఱుచతోఁక పిఱుంద మెఱయుదాని

గీ. వేల్పు మన్నుజగంబందు వెల్లగబ్బి
కొలములోఁబుట్టి పుడమి మేకొన్నదాని
మావ్రటీఁడాపె వాఁకేటి తావునందు
లోపలికిఁబోవఁగాఁ ద్రోవ దోపకుండ. ౧౮౯

ఉ. వేగిన రామకేశవులు వేగమె నిద్దుర లేచి పైనపై
సాగిదొరం గనుంగొనెడుసంబరమెక్కుడుగాఁగఁదూఁగి రా
గా గడపాగి కొండయనగాఁ గనుపట్టెడుగబ్బిఁజూచి యీ
యాగడ మాడుమాపునది యంచు వచించి నలప్పుడోపికన్.

చ. వెనుకటి కాళ్లు చేనొడిసి విక్కుచులాగినఁ గట్టుకంబము
ల్పెనఁగి పెకల్చి గీయుచుచుఁ బెద్దయెలుంగున మోఁద్రిప్పి వె
న్నని వినుముట్ట బంతిక్రియ నూకొని చిమ్మిన సొమ్ములేక వెం
టనదిగి ముక్కుదన్నె వారిడాపలికాలనరంబు లుర్లఁగన్.

ఉ. ఆబిసనైన తన్నునకు నాగి దిగుల్దిగనాడి గబ్బిపై
రా బలిమిన్బికల్బెఁ జెదరన్గుదురు ల్మ్రడి గోరలు న్జెవు

ల్గాబలు ద్రిప్పితెంపె హరి గొప్పకసిం బసవత్తిమీఁదరాఁ
గా బసునైన ముష్టిఁగడఁకన్మొలిద్రిప్పిఁగూలెనేన్గుదాన్.

గీ. క్రిందఁబడినదాని గీపెట్టఁగాఁదన్ని
తొండముసురఁబట్టి తూలవిసరి
నేలఁ గొట్టఁజచ్చె నాలుక వెలిజాపి
మింట వేల్పుమూక మేలనంగ. ౧౯౩

కం. ఏనుఁగు పీనుంగై పడ
నాన న్మావటి దొలంగె నల్లయ్య కుడి
న్దోనే తేరఁగ రాముఁడు
తానెదురంగాంచె జెట్టి తండము గరిడిన్. ౧౯౪

గీ. చూచి నడుముగట్టి సోమరులార మీ
లావుఁ జూపిరండు సావునిజము
పోటుబంటులనుచుఁ బోరినమ్మి మీరాచఁ
డోడఁగాంచి దిగులుతోడఁజచ్చు. ౧౯౫

సీ. అని కేరడంబాడ నందు చాణూరుఁడు
న్బలియుండు వడిలేచి పండ్లుగొరికి
పిలగాడవని ముందె తెలియంగఁ జెప్పితిఁ
బాల్నేతి పొగరునఁ బల్కెదార
నీవెంతనాకడ నిలువంగ నోపరు
పుడమిలో నెవ్వరుఁ బోలవినవె
కండక్రొవ్వణగింతుఁ గదిసిన వెంటనే
త్రుళ్లుపాటిచొప్పటఁ జెల్లఁబోదు

గీ. కానలోనాల కదుపులఁ గాచునిన్నుఁ
గదియ వచ్చిన చచ్చు రక్కసుల గెడపి
విఱ్ఱవీగుచేనా పోర బుఱ్ఱఁదెంపి
సంగడీలకు వేడుక సలిపెదఁజుమి. ౧౯౬

శా. మున్నీటం బడిపోయినం గడుపులో మోకాళ్లుసొప్పించిన
న్మన్నుం బై సవరించి డాగిన బిరానన్బ్రాకి నోరొందిన
న్నిన్నున్నన్నుకదాటి పోయినను బెర్మిన్బడి భాపండవై
చన్నం గానల గోఁతులంగలిసినన్ జాఁగొట్టెద న్నిన్ననిన్

గీ. అనుచు నీసడించి యావుల దొరబిడ్డ
నడ్డగించె వాఁడు నంతఁమీద
ముష్టికుండు బలుని ముందర నెదురాగె
సాటివారుజూచి సంతసింప. ౧౯౭

వ. ఇట్లా జట్టిపోటరు లాగిన నయ్యాల గాపరిపాపలలో లబ్బి
మగం డొచ్చెంబులేని మచ్చరంబునఁ గచ్చకిచ్చగించిన
జట్టింబట్టి పొట్టం గాలదట్టిన వాఁడట్టె లేచి కట్టల్కజట్టు
పట్టినెట్టి నేలంగొట్ట నాగొల్లపట్టి పట్టుదప్పించి పైకెగరి
తొగరు కంట మంటలెగయ నడునెత్తి నెత్తురుజొత్తిల్లఁ
జేగొద్ది మొత్తిన నాసామి కాఁడు మోము కేవురింపఁ గావ
రమ్మునఁ గడకాళ్లొడిసి చిక్కరిచుకొని దక్కలి విఁకనిక్క
కుమని విసరి పసిదొరబిడ్డను బారవైచిన నానల్లనయ్యయు
నెదురొడ్డి దొడ్డి కట్టుగఁ జేతులొడ్డి జడ్డిగంబంట బిగించి
యూపిరి వెడలకుండఁ గుత్తుకయొత్తి పట్టిన నామల్లుం

జొల్లెడ సందుగానక గిజగిజ తన్నుకొన నేలంబెట్టి గొంతు
కోలు కాలందొక్కిన సందులేక లోఁగ్రాలుకొన్న గాలి
వెనుకతూటన దరలెనట్లాతండు మడిసినంగని రాముండంత
దాఁకఁ దనుఁదాకిన పోటరితోఁ బోరిపోరి కూకటిపట్టున
బెట్టు పిడికిట నడచినఁ దొడితొడి వెడలి నెత్తురులతోడ
నోటనూపిరి వెడలి చనియె నిట్లయ్యిద్దరు పెద్దజట్టులుంబడిన
దక్కిన వారొక్కరక్కడ లేక పంచబంగాళంబై రదియుం
తము నెఱింగి కంసుండు. ౧౯౯

ఉ. కత్తియు వేడెము ల్వెలయఁగా నిరుసేతుల మీరవచ్చినఁ
గుత్తుకబంటి యీరసము గూరిన వెన్నుఁడు మింటికేగి వా
నెత్తురు బాఱఁదన్ని నడినెత్తిఁ బగిల్చి చురిన్నడఁటు వే
యత్తఱి బాపి మామ నపుడంపె జమున్దొలు వంగ నత్తిచేఁ

ఉ. ఆతని తమ్ము లన్న పడుటారసి రోసముతోడ వచ్చి గో
ల్లాతఁడ నిన్నుఁదున్మి పగనార్చెదమంచు నెదుర్చ వాలుచే
నాతులువ ల్బడల్పడఁగ నప్పుడొనర్చెఁ జిరాలుసేసెఁ బెఁ
రాతికిఁ దాకినం దగరు రాఁబమనే గెలుపై తలంపఁగన్.

గీ. వారిపాట్లుసూచి వారలఁ గనుపట్టి
వారివార లెల్ల వారుతలఁగి
పారిరంతఁ గంసు పడఁతులు పెడతల
లడచుకొనుచు నేడ్చి రచటఁజేరి. ౨౦౨

శా. మింటన్వేల్పులు పూలవానఁ గురియన్మేలైన రూపచ్చర
ల్గంటల్గాఁ బలునట్టువల్సలుప నోజంబెట్టుగా మద్దెల

ల్వెట్టఁదట్టుచు మాపుమోరలు జగన్వోగూడ వాతేఁడుము
క్కంటింగూడుకవచ్చి చూచిమరలె నగ్దన్నుత్తోనింటికిన్.

క. వక్కపడగదాలుపు మది
చెక్కిన సంతసముతోడ నెంతయుఁగూర్మిన్
మ్రొక్కుచుఁ దలిదండ్రులఁగని
చిక్కలువాసితిరె యంచు సేమంబరసెన్. ౨౦౪

శా. కన్నీరుబ్బున మించిపారఁ గొడుకున్గారాబుతో నక్కునం
దెన్నంజేరిచి తండ్రిమంటి వీఁకమీఁదే వెంటమన్నించెదో
యన్నన్నారలబోదుజేసి తమతాతౌ నుగ్రురావించి రా
మన్నంగా నొనరించె నెల్లరు పగల్మానంగనప్పట్టునన్.

గీ. ఆతనిపనుపునాతుల
కేతీరునగాసితొలఁగి యెసగెడినటుల
నేతిజొలఁదితాటోటుల
లేతం దెగటార్చెఁ గొదువలేదనజగముల్. ౨౦౬

వ. అంతమఱియును.

ఉ. పుట్టిననాటనుండి దనుఁబొందుగఁబెంచిన తండ్రి నందుని
నగ్గట్టిగఁ గౌఁగిలించి కొఱగాములువచ్చుట లెచ్చరించి య
ప్పట్టుననుండి రావనుచుఁ బల్కక డెగ్గులు మీఁదఁగీడు లే
తట్టున గల్గినం దలఁప దాకొని మాన్పుదు నెన్నిరీతులన్.

సీ. అనియిట్టులూరార్చి యుఃపినఁబయనమై
మందకుఁబోయి రింపొందివార
లన్నాలిగొల్లల నాలమందలతోడ
వేడుకమనుపంగ వేగరులను

బనిచియుఁ దానేగుపట్ల నందఱఁజేరి
ముచ్చటలరయుచు ముదితలడుగఁ
గోరికల్లుఱియుచు గురిగల నేస్తులఁ
గని కూర్మి నెరపియు గారవమునఁ
గీ. బెనిచె నిక్కడ మదిరెలోఁ బెద్దరాచఁ
దుగ్రసేనుండు ఱేఁడుగా నునిచి తాని
తల్లితండ్రులవలెఁ బజలగవులరసెఁ
గాలయవనాదు లలబరిగాఁ జరిప
ద్వారకయొసర్చి యచ్చుటఁజేరెఁ బిదప. ౨౦౯
కం. యీకతముగించి శుకముని
యేకతమజరించె జరిగె నేలికయును నే
పోకలుఁడిగి నల్లయ్యను
జోకందలపోసి మ్రొక్కిజోక్కుచునుండెన్. ౨౧౦
కం. సిరిఱేఁడు మేనమామం
దరిగినకత నెవ్వరేనిఁ దగఁ జదివిన నె
ల్లరు వినఁజెప్పిన సిరులం
బెరుగుచుఁ దదిముత్తి గంద్రు పెనువగ లుడుగన్
కం. చందురుఁ దలనమరిచి జడ
లందున వినువాఁకనిలిపి యరమేనునసిం
పొందఁగ మలపట్టించెను
పొందించుచు నొసటకన్ను నొనరెకుసామీ. ౨౧౨
ఉ. చిచ్చటకన్ను వేదలల చిల్వట కాలఁ బూసంగుమెట్టె వె
న్వెచ్చెడి బంటు లాగడపు వేసములందు పిసాసులంట కా

డిచ్చఁక వచ్చులోఁగిలట యేవపుబూడెద మేననంట మే
లిచ్చెడిపేరు మీఁకొనరుచెట్టులో యబ్రము గిత్తతత్తడీ.

పంచచామరం. కడానకొండ వెండిగట్టు కాపురంపుటిక్కవై
బెడంగుమీర మాని చట్టుబిడ్డమీఁది కూర్మినీ
సడంబు లేక నిల్లటంచు సల్పురీతి నీకువల్
వడింజమర్పు మంచుగంటి వారనున్న వేలుపా.

సీ. ఇవపు పెన్మలబిడ్డ యొకిమీని నెనరు
చేఁదోఁచిన యల్లిక దాలకువాఁడఁ
బాటిబండనుపేర బరగు నిల్వడినొప్పి
పురుషోత్తమాఖ్యఁ బెంపొందినాఁడ
గిన్నెపేరిటివాని వెన్నుండు గూర్చిన
కతలన్ని జతపెట్టఁ గడఁగినాఁడఁ
దెలుఁగునఁ గబ్బంబు గలిగింప సమకట్టి
తిందు మూఁడవపాళె మిటులముగిసె

గీ. దీని నెవ్వరు పుడమిని దీపులమరఁ
జదివినను బెద్దవారికి సరవి దెలుపఁ
దనకు దాని సిరుజ్జేరుఁ దలగుఁ గీడు
లట్టివారికి నల్లయ్య డనువుపరుప. ౨౧౭

క ం స వి జ య ము.

మూఁడవపాళెము ముగిసెను.

---

# తప్పొప్పుల పట్టిక.

పీఠికలో 19 వ పేజీలో

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| మన కవిగారి అన్నగారైన ఆదెమ్మగారు | మన కవిగారి తమ్ముఁడైన ఆదిలక్ష్మమ్మగారు |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 12 | క్రీము ... నేచి | లేము ... లేచి | 38 | 12 | రోలి | రోసి |
| 5 | 1 | ఫుట్టు | ఫుట్టు | | 15 | రబ | రఖరబ |
| 8 | 20 | నతం | యతం | 34 | 2 | నేసుట | సేయుట |
| 9 | 19 | వోట్టు..పాటు | కట్టు...పాటి | 37 | 2 | క్మ్రిగిక్ష | క్మ్రిలిక్ష |
| 10 | 6 | వేగాలు | వేవేలు | | 14 | ట్టుసఁజె | ట్టినచె |
| ,, | 10 | జుట్టి | జుట్టు | 39 | 6 | రంబబ | రంబ |
| 11 | 3 | ట్లుఁటేని | ట్లున | 42 | 19 | పిపాను | పిసాను |
| | 7 | బుట్టు | ఫుట్టు | 43 | 1 | ఱేనిగేస్త | రాయనుంగ |
| 12 | 16 | జేర | చేర | 46 | 2 | జిన్న | జిన్న |
| | 17 | వారుఁలం | వారలం | | 20 | బెస్వడిక్ష | చేస్వడిక్ష |
| 13 | 1? | చెనటు | చెనటి | 48 | 6 | దాత | ఆత |
| | 18 | కొమ్మలు | కొమ్మలు | | 14 | యుద్ద | యడ్డ |
| 14 | 16 | నగవుడు | వగవుడు | 50 | 1 | మొడ్డున | మొడ్డు |
| 15 | 21 | కేటుకి | కేటికి | | 14 | తుదిగ | తుది |
| 16 | 23 | వఱలం | వఱలం | 51 | 12 | ఫుట్టి | ఫుట్టు |
| 17 | 12 | వెన్నఁ | వెన్నఁ | 54 | 22 | చాటున | చాటున |
| 19 | 9 | డన్వాలుదక్ష | డన్వాలఁదక్షు | 55 | 7 | బొట్టియ | పొట్టియ |
| | 14 | సామిన్నిగొల్లడిం | సామియుఁగొ | | 16 | యాడైన | యాడైన |
| | ,, | టుబఁక్కవా | ల్లనింటబుట్టువా | 56 | 16 | కూటికలు | కూటువలు |
| 28 | 19 | కడపలి | కడపటి | | 17 | కొడు | కొడుకు |
| 29 | 1 | బొట్టి | బొట్టె | | 22 | లూడలు | ల్గూడలు |
| 31 | 11 | బాట | లాట | 57 | 20 | ద్రోహ్కుడు | ద్రోహుడు |
| | 20 | పజ్జ | పజ | | 21 | బూని | పూని |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 58 | 8 | రుశె | రుఁదె | 89 | 11 | టలనాద | టలఁద |
| | 13 | చే..మమశక | పరి..చుడుగక | 90 | 4 | తకన్టట ట | తక్కుటకట |
| 59 | 9 | నంరు | ఋందు | 92 | 4 | వాటినిం | వానినిం |
| 65 | 1 | నషం | నకం | | 19 | బ్రద్ధి | స్పద్ధ |
| | 5 | మచ్చ | మచ్చె | 93 | 1 | ల్మెండం | ల్మెడం |
| | 15 | దాల్చి | వార్చి | | 3 | గాబా | గాఁబా |
| | 17 | గణో | రినో | | 4 | త్రెంపు | తెంపు |
| 67 | 17 | తరపురం | తెఱపిమొం | | 8 | పయ్యా | వయ్యా |
| 68 | 4 | బిగగ్గిజా | చియగ్గిపై | | 19 | జెవ్రుము | జెప్పుము |
| 71 | 2 | పను | పడ | 94 | 9 | గట్టు | గట్టి |
| 72 | 17 | యందాక | ఋందాక | 95 | 19 | నుంచి | నుండి |
| 73 | 3 | జేయ | జేయు | 97 | 4 | ధలంట | దలంట |
| 75 | 9 | వల్లె | పల్లె | 98 | 4 | బోట్ట | బొట్ట |
| 78 | 14 | నొచ్చెసె | నొచ్చిశె | 101 | 19 | బ్రజ | పజ |
| 80 | 11 | పబో | పంబో | 102 | 4 | తోఁజనియపా | తో వెలలెఁ |
| 82 | 9 | కన్నె | కన్నె | 103 | 21 | వను | పను |
| 83 | 4 | దప్పడు | వప్పదు | 105 | 1 | నవ్వుల | దవ్వుల |
| 84 | 3 | నీటు | నేపు | 106 | 13 | బేకామ | చేకామ |
| 84 | 8 | గొల్లడఁ | గొల్లఁడ | 107 | 6 | జేట్వాటు | చేడ్వాటు |
| | 11 | తడవటినుంచి | తడవులనుండి | 112 | 8 | తోటి | తోడి |
| | | దాలుపనామొ | దాలిచియామొ | 113 | 21 | యడ | నెడ |
| 85 | 19 | వెట్లు | లెట్లు | 114 | 2 | రొకటి | గొఁకటి |
| 86 | 10 | జాలరనిఁ | జాలరని | | 10 | గేక | గూఁక |
| 87 | 3 | ల్వియ | ల్వెవి | 117 | 14 | వీఁడిది | లీఁడిది |
| | 4 | పుంబాపల్ల | పున్నాయన్న | 118 | 6 | పైదవి | పైదలి |
| | | విందూర | లండాఁచి | | 21 | మ్రానఁబి | మ్రానపి |
| | 5 | గాఁబ్రేరేచి | లొప్పంజేసి | 119 | 1 | బొగడఁదా | బొగడతా |
| | | త్రియే | తీయేఁ | 120 | 17 | కవి | కలి |

ఈ గ్రంథములు వలయువారు—

రామా అండ్ కో., బ్రాంచి: తెనాలి.

లేక

భారతీ గ్రంథమండలి, సత్తెనపల్లి.

అని వ్రాయవలయును.